'సహృదయ మిత్రమండలి' 23 ఏళ్ళ ప్రస్థానాన్ని పురస్కరించుకొని...

# మరుగునపడ్డ మహాయోధులు

(కొద్దిమంది ప్రజాపక్ష బుద్ధి జీవుల పరిచయాలు)















## గౌరవ్

# మరుగునపడ్డ మహాయోధులు

## (కొద్దిమంది ప్రజాపక్ష బుద్ధి జీవుల పరిచయాలు)

## గౌరవ్

**ముద్రణ**

జనవరి, 2024

**ప్రచురణ**

సహృదయ మిత్రమండలి - పిఠాపురం

**మూల్యం**

అమూల్యం



**వివరాలకు**

పి.గంగాపావని

సహృదయ మిత్రమండలి, రిజిస్టర్డు నెం : 703/2011

14-1-11, వంగల వారి వీధి, పిఠాపురం - 533 450

సెల్ : 965 255 2556

# ముందుమాట

సామాజిక మాధ్యమాల్లోకి నేను లేట్ కమ్మర్‌ని. బాగా ఆలస్యంగా ప్రవేశించాను. అలా వచ్చాక కూడా ఏక్టివ్‌గా ఉన్న సందర్భాలూ, స్పందించే సమయాలూ తక్కువే. రాను, రానూ మొత్తంగా మానుకోవాలనే ఆలోచన కూడా ఉంది. నా కారణాలు నాకున్నాయ్. కానీ, ఉన్నప్పుడు మాత్రం సజీవంగా, సకారణంతో, సార్ధకతని సాకారం చేస్తూనే రాసాను. క్షేత్రస్థాయిలో చేసిన నా కార్యాచరణను నిర్మాణాత్మకంగా ప్రకటిస్తూ భావోద్యమాల్ని బలోపేతం చేయ డానికి, ప్రజాతంత్ర విధానాలకి ఆసరాగా అక్షరాల్ని మల్చడానికే నిజాయితీగా ప్రయత్నించాను. అందులో భాగమే అడపాదడపా రాసిన ఈ రైటప్‌లు.

సామాజిక సాంస్కృతిక కార్యరంగం నుండి విడివడి ప్రత్యేక రచనా వ్యాసంగం అంటూ నేనేదీ చేయలేదు. సామాజిక కార్యకర్తగానే కానీ, కేవల రచయితగా నేనెన్నడూ మన లేదు. మానవాళి ఉన్నతి కోసం ఉద్దేశించిన కార్యక్రమం, అదేదయినా కూడా సమిష్టితత్వం లోనే శోభిస్తుందనేది నా భావన. అందుకే అనుకున్న దానిని అమలుచేస్తూ క్రియా శీలకంగా సమాజంలో భాగమవ్వడమే కానీ, సిద్ధాంతాల పద్ధతిని పాటించింది లేదు. దానివల్ల లాభమా నష్టమా అనే బేరీజులు వేసుకుందుకు కూడా వ్యక్తిగతంగా సిద్ధంగా లేను. ఏదో నాకు అనిపించింది చిన్నగానే అయినా బలంగా అనేకానేక పరిమితుల్లో చేసాను, దట్సాల్ .

ఈమాత్రం ఉనికిని కూడా తట్టుకోలేక నా పై రాళ్ళేసే వాళ్ళకి కూడా కొదవలేదుగానీ, చేయవలసిన పనినెంతో పెట్టుకొని అకారణ అసూయ ద్వేషాల్ని ప్రత్యేకంగా పెంపొందించుకోడానికి సమయం కేటాయించి మరీ వాళ్ళు చేసే వ్యాయామం చూస్తే మాత్రం నిజంగానే బాధనిపిస్తుంది. అంతటి శత్రుత్వానికి నేను అర్హుడ్ని కానేమోననే చింత మనస్సులోంచి ఎక్కడో కలుక్కుమని పొడచూపుతుంది. ఐనా,ఎదురయ్యే వింత దారుల్ని పలకరించుకుంటూ మన మార్గంలో ముందుకు సాగి పోవడమే కదా జీవితం. అలా అనుకున్నప్పుడిక కర్తవ్య నిర్వహణ మినహా మరే గొడవా తాకదు.

అప్పుడిక విమర్శలకు, పరామర్శలకు లోటు లేదు కానీ రోజురోజుకీ శక్తివంచన లేకుండా మరింత లోతుగా పని చేయాల్సి ఉందనే నిజం మాత్రం ప్రత్యక్షంగా కనిపిస్తోంది. ఈ దేశంలో దోపిడీ, పీడన లేని ఒక సమానతా వ్యవస్థ గురించి పాటు పడుతున్న వివిధ స్రవంతులతో కలగలిసిపోతూ పయనించడానికి నిర్ణయించుకున్న ఒక సాధారణ కార్యకర్తగా ఎప్పుడైనా రాతలకి న్యాయం చేయగలిగానని అనిపించి నప్పుడు చేస్తున్న యత్నాలే ఈ చిరుపొత్తాల రూపంలో తీసుకు వస్తున్న ప్రచురణలు. ఇది కూడా అలాంటిదే. ఇవన్నీ సంక్షిప్త పరిచయాలే కానీ సమగ్రాలెంత మాత్రం కావని మరొక్కసారి మనవి చేసుకుంటూ, వీటిని ప్రచురించిన పత్రికలన్నింటికీ పేరు పేరునా కృతజ్ఞతలు. విమర్శలకి ఆహ్వానం.

– గౌరవ్

## అద్దంలో ఆకాశాలు

"మరుగునపడ్డ మహాయోధులు"

ఇది సుమారు యాభై పేజీల చిన్న పుస్తకమే అయినా క్లుప్తపరచిన పదిమంది మహానుభావుల జీవిత చరితల వజ్రాల ఖని.

సంక్షిప్తపరచిన నిజజీవితాల నిక్షిప్తాల నిధి. మనసు మూలల మూలాల వెలుతురు ప్రసవించి, ప్రసరించి, ప్రవహించి స్ఫూర్తిదాయక ఉత్సాహాన్ని ప్రోత్సహించే ఉత్తమ ఉత్ప్రేరకం. నేటి తరపు యువత దశదిశ నిర్దేశితకు దారిచూపే జ్ఞానదీపం.

నిజానికి పాఠశాలల్లో పాఠ్యాంశాలుగా చేర్చితే యువతను ప్రభావితం చేసి, ప్రతిభావంతులుగా తీర్చే ఆదర్శ రచన.

అంతటి అదృష్టం మన విద్యా విధానానికెక్కడిది?

అనూహ్యామూ, అపూర్వమూ, అపురూపమయిన రైటప్‌లతో సదా విజ్ఞాన వెలుగులు, రసమయ సాహిత్యం పంచుతున్న స్వచ్ఛమైన సాహితీ శ్రామికుడు...

కొన్ని జీవితాల సజీవ చిత్రణకు సంచలన సంచారాలు చేసి విసుగెరుగక విషయ సేకరణ చేసే విశేష ప్రజ్ఞగల వ్యాసకర్త మిత్రుడు గౌరవ్‌కు అభినందనలు....

పిఠాపురం **మేకా మన్మథరావు**

జనవరి, 2024

# అంకితం



ఈ దేశ సాంస్కృతిక వికాసానికి ఎనలేని కృషి చేసిన మహావ్యక్తి, మనుషుల ఉన్నతి కోసం మనసుల ఎదుగుదల కోసం తపించిన కళాతపస్వి, చత్తీస్‌గఢ్‌లో పుట్టి విశ్వవ్యాప్తంగా ఎదిగి, శతజయంతి ఉత్సవాలను ఘనంగా జరుపుకోవాల్సిన తరుణంలో కూడా ఎవరో కొద్దిమందికి తప్పా తెలీకుండా కాలగర్భంలో మిగిలిపోయిన కవి, రచయిత, కళాకారుడు, గాయకుడు, ప్రజాప్రయోక్త , ప్రయోగశీలి , పద్మశ్రీ పద్మవిభూషణ్, **"హబీబ్ తన్వీర్"** (1923 - 2009) అవిస్మరణీయ కృషికి, అపురూపంగా ఈ కృతినిలా...

# విషయ సూచిక

# ఎగిరే ధిక్కార పతాక - కలేకూరి ప్రసాద్ !
## [60 వ జయంత్యుత్సవ ప్రత్యేక వ్యాసం]



"చావులేని ఆశయాల ఆవాహనే సంస్మరణ" అంటాడు కలేకూరి కార్మికోద్యమకారుడు, పీడిత ప్రజల నేత కామ్రేడ్ శంకర్ గుహ నియోగి గురించిన నివాళి వ్యాసంలో. ఈ రోజు అలాంటి మహోన్నత ఆశయాల కొనసాగింపు కలేకూరి స్ఫూర్తి. సామాజిక కార్యకర్తగా, ఉద్యమశీలిగా, మేధావిగా, కవిగా, రచయితగా, విమర్శకుడిగా, అనువాద కుడిగా, ప్రజా పాత్రికేయుడిగా అన్నింటికంటే ఉత్తమమైన మానవతావాదిగా కలేకూరి ప్రస్థానం బహుముఖ విస్తృతం. తెలుగు నేల మీద రాడికల్ సిద్ధాంతాల నుండి దళిత ఉద్యమాల వరకూ అన్ని స్రవంతులలోకి క్రియాశీలకంగా ప్రవహించిన ప్రజాతంత్ర గొంతుక కలేకూరిది. భారత జర్నలిజానికి అంబేద్కర్ని వైతాళికుడిగా ప్రకటించిన కలేకూరి ఒక్క దళితులకే కాదు, మొత్తం దేశానికే ఈ రోజు అంబేద్కర్ అవసరం అంటూ బల్లగుద్ది చెప్పాడు. బుద్ధుడు, కబీర్, ఫూలే, పెరియార్, నారాయణ గురు వంటి ప్రత్యామ్నాయ భారతీయ బహుజన తాత్విక యోధుల పై అద్భుతమైన విశ్లేషణాత్మక రచనలు చేశాడు. అంబేద్కర్నే ఆకట్టుకున్న మహత్తర గ్రంథం, స్వామి ధర్మతీర్థ రాసిన హిందూ సామ్రాజ్యవాద చరిత్ర మొదలుకొని అరుంధతీ రాయ్ , మహాశ్వేతాదేవి, బషీర్, ప్రిమో లెవీ వంటి మహామహుల అక్షరాల్ని అబ్బుర పరిచే రీతిలో తెలుగులోకి అనువదించాడు. "పాట జీవితమైనప్పుడు, పాట జీవన సంగ్రామమై నప్పుడు, పాట అణగారిన ప్రజల ఆశల ప్రతిఫలం అయినప్పుడు పాటకి ఎన్నటికీ మరణం లేదు" అన్న కలేకూరి అద్వితీయమైన పాటలెన్నో తెలుగు సమాజానికి అందించాడు. ఈ రోజు ప్రజానీకం నోళ్ళలో నానుతున్న అనేక గీతాలు ఆయనవేననే సంగతి తెలీయనంతగా ఆయన పాటలు ప్రజల్లో పెనవేసుకు పోయాయ్ !

"అంబేద్కర్ చూపుడువేలు సూర్యుడినే చూపిస్తుంది, మేల్కొన్న తరాలు ఆ వెలుతుర్ని ఆస్వాదించండి." అంటూ నవతరాన్ని ఆహ్వానించిన కలేకూరి తెలుగు సమాజంలో అంబేద్కర్ని లోతుగా అధ్యయనం చేసి ఆయన్ని గుండెలనిండా ఆవాహన చేసుకున్న అరుదైన వ్యక్తి. అందుకే అంబేద్కర్ పుట్టినరోజుని 'ఒక విప్లవం పుట్టినరోజు' అంటూ పేర్కొన్న ప్రసాద్, 'అంబేద్కర్‌ను కోల్పోయిన ప్రపంచం శవం' అయిందంటాడు. 'ఎవరి ఉద్దేశాలు, లక్ష్యాలు ఏవయినా అంబేద్కర్ కలల్ని సాఫల్యం చేయడానికి నడుం కట్టడమే ఈ తరం కర్తవ్యం" కావాలంటాడు. అంతేకాదు, నవయాన సిద్ధాంతంలో కీలకాంశం కులనిర్మూలన అంటూ అంబేద్కర్ లేని ఆధునిక బౌద్ధం లేదంటాడు. "అంబేద్కర్ అభివృద్ధి చేసిన బౌద్ధం వెలుతురులో మళ్ళీ దేశంలో సమతా మమతలు పురుడు పోసుకోవాలి"అంటూ, "అందుకు మనమంతా మంత్ర సానులం కావాల"ని పిలుపిస్తాడు కలేకూరి. ఇంతకు మించిన స్పష్టత ఏ ఉద్యమ కారుడికీ ఉంటుందనుకోను. దళిత బహుజన తాత్విక దృక్పథానికి సంబంధించిన చర్చలు అనేక పాశ్వాల్లో జరుగుతున్న సమయంలో కలేకూరి ఇచ్చిన హృదయాన్ని కదిలించే సమతా సందేశాన్ని ఒక సమున్నతమైన నిర్మాణ రూపంగా మల్చుకోవడమే మన ముందున్న పెద్ద సవాలు.దళిత సాహిత్య సదస్సులో ప్రసంగిస్తూ దళిత రచయితలకు కలేకూరి చెప్పిన సూచనలు చాలా విశిష్టమైనవి. మొత్తం ప్రజా ప్రత్యామ్నాయ రచయితలు అందరికీ ఈ రోజు వర్తించేవి. అందులో మొదటిది దళిత రచయిత శాశ్వత ప్రతిపక్షంగా వ్యవహరించాలి. అధికార పీఠాలకూ, చివరకు దళిత నాయకత్వానికీ కూడా నిర్మాణాత్మక ప్రతిపక్షంగా వ్యవహరించాలి అంటాడు. వాటిల్లో కలేకూరి ఉల్లేఖించిన అపురూ పమైన ఆశావహ దృక్పథం ఎంతటి తిరుగులేని ఆత్మవిశ్వాసంతో ఉంటుందంటే, "ఆలస్యం అయ్యింది కానీ ఇంకా గాడాంధకారం అలముకోలేదు. దళిత ముద్రను కాలం మీద వేద్దాం." అనే గొప్ప భరోసాతో ముగిస్తాడు !

"విమర్శ విధ్వంసానికి కాదు, పరిరక్షించు కోడానికి. ఆత్మ విమర్శ ఆత్మ నిందకు కాదు, సరిచేసుకోడానికి." అని నిర్ద్వందంగా చెప్పిన కలేకూరి ఉద్యమశక్తుల ఐక్య కార్యాచరణనే అంతిమంగా ఆశించాడు. ఒక దళిత కార్యకర్త ఆత్మహత్య చేసుకోవడంపై చలించిపోయి విలాస్ ఘోరే ఆత్మహత్యను గుర్తుచేస్తూ "దళిత ఉద్యమం పురుగులమందు తాగింది" అంటూ మండిపడ్డాడు. చీలికలు,పీలికలతో ఉద్యమాలకి పట్టిన గతిని అక్షరాలతో అడ్డంగా కడిగి పారేసాడు. దళిత బహుజన మేధావులు, కార్యకర్తలకి ఉద్యమ దిక్సూచిని ఆవిష్కరిస్తూ, "జాతి చెక్కిళ్ళ మీద నిలిచిన ఒక్క కన్నీటి బిందువు నుండి ఇంద్ర ధనస్సులను ఆవిష్కరించాలి" అంటాడు. ఐక్య వేదికల అవసరాన్ని ఇంత అందంగా చెప్పిన వారు తెలుగు సాహిత్యంలో మరొకరు లేరు. డిసెంబరు ఆరున అంబేద్కర్ మరణం, బాబ్రీ మసీదు కూల్చివేత రెంటినీ కలిపి "రెండు అస్తమయాలు ఒకటే గాయం" అన్న కలేకూరి దళిత బహుజన శక్తులు, ముస్లిం మైనారిటీల ఐక్యత అత్యంత అవసరం అని ఆకాంక్షించాడు. మతోన్మాదాన్ని ఓడించడానికి రాజకీయంగా కలవడం తప్పనిసరంటూ నినదించాడు. లెక్కలేనన్ని సమీక్షలు రాసాడు, అన్నే విమర్శలు చేసాడు. ఇవన్నీ ఒకెత్తయితే లక్నోలో జరిగిన పెరియార్ మేళా సమీక్ష మొదలుకొని పెడెల్ కాస్ట్రో వంటి మహా మహుల్ని కూడా ఆకట్టుకునేలా డర్బన్‌లో జరిగిన సదస్సులో జాతి వివక్షపట్ల తన నిరసనని నినదించడం వరకూ అంతర్జాతీయ వేదికలపై కూడా ధిక్కారాన్ని తిరుగులేని స్పష్టతతో ప్రకటించడం మరొకెత్తు. అందుకే అమెరికా సామ్రాజ్యవాదం చేసిన సద్దాం హత్యను నిరసిస్తూ, "కాలం వీరులకే సలాం చేస్తుంది" అంటాడు!

"నేను జన సమూహాల గాయాన్ని గాయాల సమూహాన్ని/ తరతరాలుగా స్వతంత్ర దేశంలో అస్వతంత్రుడ్ని/ అవమానాలకూ, అత్యాచారాలకూ, మానభంగాలకూ, చిత్రహింసలకూ గురై పిడికెడు ఆత్మగౌరవం కోసం తలెత్తిన

వాడ్ని..” అని ఘోషించిన కలేకూరి, “నేను బాధితుడ్ని కాదు అమరుడ్ని/ ఎగిరే ధిక్కార పతాకాన్ని” అని ఎలుగెత్తి ప్రపంచానికి చాటిన మహాకవి. వర్తమాన సంక్షోభ కల్లోలంలో ఉద్యమ కార్యాచరణ పట్ల నిస్పృహ కలుగుతున్న వేళ, నిబద్ధత కలిగిన కలేకూరి వంటి అసాధారణ ఆలోచనాపరుల కృషిని స్మరించుకోవడం అన్ని ప్రగతిశీల ప్రజాతంత్ర దళిత బహుజన ఆదివాసీ స్త్రీ మైనారిటీ ఉద్యమ స్రవంతుల బలోపేతానికి అత్యవసరం. అందులో భాగంగా విబేధాలను పక్కన పెట్టి రాబోయే కొత్త తరాలకు స్ఫూర్తిని ఇచ్చేలా ఉద్యమ స్రవంతులన్నీ ఎక్కడికక్కడ సమిష్టిగా సంఘటితమవడం ఈనాటి కర్తవ్యం. ఈ సందర్భంగా అలాంటి ఐక్య ఉద్యమ కార్యాచరణకు సమయం ఆసన్న మైందని గుర్తించి బ్రాహ్మణీయ మతోన్మాద తిరోగమన ఆధిపత్య కుతంత్ర శక్తులకు వ్యతిరేకంగా గొంతు విప్పేందుకు మన వంతుగా ముందడుగు వేయడమే కలేకూరికి ఇచ్చే నిజమైన నివాళి కాగలదు !

(అక్టోబర్ 25 కలేకూరి ప్రసాద్ 60 వ జయంతి)

# అజరామర అక్షరాగ్ని శిఖరం ! అఖండమైన ప్రజా కవిత్వం

## అలిశెట్టి ప్రభాకర్ !



అలిశెట్టి ప్రభాకర్. పేరు కాదిది, తెలుగు కవిత్వంలో పెల్లుబికిన అగ్ని శిఖరం. ఒకతరం యువతరం గుండెల్లో లావాలా ఎగసిన అక్షరాల నిత్యాగ్నిగుండం. పీడితులు, బాధితుల పక్షాన నిలవడమే కలం కర్తవ్యమని తెగేసి నిర్దేశించిన నిఖార్సైన కలం ఖడ్గం. అభాగ్యజీవులకి తోడుండేదే నిజమైన అక్షరమని పిలుపిచ్చిన తిరుగులేని నిరసన గళం, ఇవన్నీ వెరసి అలిశెట్టి ప్రభాకర్. విలక్షణ కవి,చిత్రకారుడు, ఫొటోగ్రాఫర్, భావోద్యమశీలి, తాత్వికుడు, స్వాప్నికుడు అన్నీ. భాష పై బహుశా మరే కవికీ లేనంత బలమైన పట్టు. భావాల సుడిగుండాల్లో తనకంటూ స్పష్టమైన కసరత్తు. ఇక అభివ్యక్తి మాటకొస్తే అలిశెట్టి దరిదాపుల్లోకి వచ్చే కవుల్ని వేళ్ళ మీద లెక్కపెట్టొచ్చు. ఎవరూ అనక్కర్లేదు కానీ అలిశెట్టి అక్షరాన్ని ఆకాశమంత ఎత్తులో నిలిపిన మహాకవి, ఎవరూ ఒప్పుకోనవసరం లేదు కానీ అలిశెట్టి కవిత్వానికి కవాతు నేర్పిన యుగకవి !

“నా గుప్పెట్లో మండుతున్న ఎన్నో గుండెలు/ ఒక్కొక్కదాన్లో దూరి, వాట్ని చీరి, రక్తాశ్రువులు ఏరి పరిశీలిస్తాను నేను” అంటూ ‘నా కవిత’ లో ప్రకటించుకున్న ప్రభాకర్, “నను తొలిచే బాధల ఉలే నను మలిచే కవితా శిల్పం” అంటూ తాను ఎవరి పక్షమో బల్లగుద్ది మరీ చెప్పుకున్న కవితా సైనికుడు. తెలుగు కవిత్వంలో పీడితుల వైపు నిలబడి అత్యంత పదాల పొదుపుతో అదుపు లేని అక్షరాగ్నిని దశాబ్దాల

పాటు నిరవధికంగా కురిపించిన అద్వితీయ కవిత్వం అలిశెట్టిది. అందుకే, “దేశాన్ని పోగొట్టుకున్న గర్భ శోకం నుంచే మళ్ళీ నేనొక వీరుణ్ని కలగనాలి/ దిక్కులు కూలిన దుఃఖం నుంచే/ దిగంతాల అంచులు దొరకని ఆక్రోశం నుంచే/ మళ్ళీ మళ్ళీ కుప్పకూలిపోతున్న మరణశయ్యమీంచే, నన్ను నేను ఆయుధంగా మలుచుకోవాలి/ శరీరం శిథిలాయుధమైనా/యోధుడిగా మును ముందుకే కదిలి/కదనరంగాన్ని వశ పర్చుకోవాలి” అని తిరుగులేని విశ్వాసాన్ని భావోద్రేకంతో వెలువరిస్తాడు !

తెలుగు కవిత్వంలో వెనకడుగు వేయని ధీమాతో పీడిత ప్రజల వైపు తొలి నుంచీ  నిలిచిన కవి అలిశెట్టి. “కన్నీళ్ళని ఏభాషలోకి అనువదించినా, విషాదం మూర్తీభవించిన స్త్రీ యే సాక్షాత్కరిస్తుంద”ని రాసిన అలిశెట్టి, వేశ్య కవితలో “తను శవమై, ఒకరికి వశమై/ తనువు పుండై, ఒకడికి పండై/ ఎప్పుడూ ఎడారై, ఎందరికో ఒయాసిస్సై” అంటాడు. ప్రపంచంలో ఏ భాషా కవిత్వం లోనూ ఇంతటి సూక్ష్మమైన పదాలతో స్త్రీ హృదయంలోని లోతైన భావ సంఘర్షణను చిత్రించిన కవిత ఇప్పటిదాకా రాలేదనీ, ఇక పై రాబోదని నా అభిప్రాయం. అంతేకాదు,”అన్నం మెతుకునీ, ఆగర్భ శ్రీమంతుడ్నీ వేరు చేస్తే, శ్రమ విలువేదో తేలిపోదూ..?” అన్నప్పుడు ప్రభాకర్ మొత్తం శ్రమ దోపిడీ సారాన్ని ఒక్క వాక్యంలో ఇమిడ్చిన తీరు ఆశ్చర్య పరుస్తుంది. అంతటి ప్రతిభావంతుడు కనుకనే అతడ్ని కవిత్వ మాంత్రికు డంటారు. నవ్య కవితా వస్తువుని నిర్దేశించిన అలిశెట్టి తాను నమ్మిన దార్శనికతనే కవిత్వంలో ప్రవేశపెట్టి ప్రకంపనలు సృష్టించాడు!

ఎర్ర పావురాలు (1978), మంటల జెండాలు, చురకలు (1979), రక్తరేఖ (1985), ఎన్నికల ఎండమావి (1989), సంక్షోభగీతం (1990), సిటీలైఫ్ (1992) కవితా సంపుటాలు అంతర్లీనంగా రగులుతున్న అలిశెట్టిలోని అక్షర లావాని అచ్చు

రూపంలో వెల్లడించిన కొన్ని పుస్తకాలు మాత్రమే.ఇంకా అచ్చు కానివీ, ఆర్థిక ఇబ్బందులతో, అస్థిరమైన జీవనయానంతో , అనారోగ్యంతో నిత్యం పోరాటం చేస్తూ అలిశెట్టి పోగొట్టుకున్న కవితలకు లెక్కే లేదు. కేవలం కవిగానే గాక, జగిత్యాలలో స్టూడియో పూర్ణిమ, కరీంనగర్‌లో స్టూడియో శిల్పి, హైద్రాబాదులో చిత్రలేఖ స్టూడియోలు పెట్టి జీవిక కోసం జీవన అస్థిత్వం కోసం ఆరాట పడ్డాడు. కళాత్మకమైన జీవన తాత్వికతలోకి కవిత్వాన్ని ప్రవేశపెట్టాడు. బహురూపాల వ్యవస్థ వర్ణాల్ని బతుకు పోరాటంలో దర్శించిన భావుకుడు. కవితా వినీలాకాశంలో చెమటచుక్కల్ని చక్కగా ఆవిష్కరించిన దార్శనికుడు అలిశెట్టి ప్రభాకర్ !

అందుకే, ‘‘లోపభూయిష్టమైన వ్యవస్థే వ్యక్తుల్ని తుపాకులుగా తీర్చిదిద్దుతుందన్న” అలిశెట్టి, “ఉదాసీనంగా ఉండే కన్నీళ్ళే ఉప్పొంగే నదులైనప్పుడు, దండాలు పెట్టే బాంచెన్ బతుకులు దండకారణ్యాలై రగులుకోవా..!” అంటాడు. అంతేకాదు, “ఎన్నికల బరిలో దిగాలో, నక్సల్బరిలో దూకాలో ..క్షణం క్షణం రణం! సందిగ్ధా వస్థలో జనం!!” అంటూ మార్గ నిర్దేశం చేస్తూ, “అడుగంతా తడిసిన కన్నీటి సముద్రం/ ఉపరితలమంతా వెలసిన నెత్తుటి ఆకాశం/మధ్యన వెలిగే మహోజ్వల మానవ నేత్రమే పోరాట సూత్రం..” అని సామాజిక సంక్షోభాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తాడు. సాహిత్యం, సామాజికం, సాంస్కృతికం, కళలు, రాజకీయం, సినిమా... ఇలా చెప్పుకుంటూపోతే అలిశెట్టి అక్షర కొరడాతో చాచిపెట్టి కొట్టని ఒక్క వ్యవస్థ కూడా లేదు. అన్యాయలు, అక్రమాలతో అనుదినం దిగజారిపోతున్న సమాజాన్ని తన అవిశ్రాంత అక్షర రణంతో మానవీయం చేయాలని చివరివరకూ తపించినవాడు అలిశెట్టి !

అందుకే ప్రేమని, విప్లవాన్ని కూడా ప్రేమించాడు. బతుకుని, చావుని సమానంగానే స్వీకరించాడు. ‘మరణం నా చివరి చరణం కాద’ని ధిక్కారం నిండిన

గొంతుతో దిక్కులు పిక్కటిల్లేలా ప్రకటించాడు. జయధీర్ తిరుమలరావు, నిజాం వెంకటేశం, బి. నర్సన్ ల సంపాదకత్వంలో 2013లో వెలువడిన అలిశెట్టి ప్రభాకర్ కవితల పుస్తకం ప్రచురించబడి కూడా పదేళ్ళవుతోంది. జయంతి, వర్ధంతులు కూడా ఒకే తేదీన జరుపుకునే (12-1-1954 - 12-1-1993) ఏకైక తెలుగు కవి బహుశా అలిశెట్టేనేమో. తెలుగు కవిత్వంలో అగ్గిని పుట్టించగల అజేయమైన అక్షరాయుధాల్ని సృష్టించి, శ్రమజీవుల ప్రవక్తగా కవిత్వాన్ని నిర్వచించి, పదాల్లో ప్రేమ కురిపించి, వాక్యాలతో మానవతా వారధుల్ని నిర్మించిన అలిశెట్టి కవిత్వాన్ని పాఠ్యాంశాలుగా పెట్టడం, ప్రగతిశీల ప్రజాతంత్ర అభ్యుదయ శక్తులు అలిశెట్టి అక్షరాలకి మరింత విస్తృతి కల్పించి ఎక్కడికక్కడ కవితా పఠనాలు, సంవాదాలు, సమాలోచన సమావేశాలు జరపడం ద్వారా ప్రభాకర్ ని మరింతగా ప్రజానీకంలోనికి తీసుకు వెళ్ళడమే అజరామర నవయుగ కవితాక్షర శిఖరంగా మన తరం అలిశెట్టికి ఇచ్చే నిజమైన ఆత్మీయ నివాళి కాగలదు !

(2013 లో మొదటిసారి మొదలుకుని 2017 మూడో ముద్రణ వరకూ నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్ తెచ్చిన 362 పుటల అలిశెట్టి కవిత్వం సాఫ్టాపీ నెట్లో అందుబాట్లో ఉంది. నా వాట్సప్ 9032094492 నంబర్ కి రిక్వెస్ట్ పెట్టినా కూడా సాఫ్ట్ కాపీ పంపగలను.రేపు జనవరి 12 మహాకవి, ప్రజాకవి అలిశెట్టి ప్రభాకర్ జయంతి, వర్ధంతి సందర్భంగా, ఆ అజరామర అక్షరయోధుడికి చిరు నివాళిగా చాన్నాళ్ళుగా అనుకుంటున్న ఈ  చిన్న రైటప్!)

# “చరిత్ర కలిగిన చరిత్రకారుడు!”

## కంభంపాటి సత్యనారాయణ సీనియర్

**(మరుగునపడ్డ మహామేధావి)**



“ఐదు దశాబ్దాలు కమ్యూనిస్టు పత్రికల్లో గడించిన రచనా నుభవం నుంచి ఒక పరిశోధకుడిగా కంభంపాటి సత్యనారాయణ ఎదిగి A Study Of the History and Culture of the Andhras (ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి : ఒక అధ్యయనం) అనే గ్రంథాన్ని తమ జీవిత చరమ దశలో రచించారు. దాదాపు వెయ్యి పేజీల (937 పేజీల) ఈ ఉద్గ్రంథం రాశి (Quantity)లోనే కాదు, వాసి (Quality)లోనూ విలక్షణ గ్రంథం. ఈ ఉద్గ్రంథాన్ని తెలుగులోకి అనువాదం చేస్తూ, మహీధర రామమోహనరావు ‘నా మాట’లోముఖ్యమైన విషయాన్ని మనందరికీ మరొకసారి గుర్తు చేసారు. ఆ మాటల్ని కమ్యూనిస్టులే కాదు, దేశ ప్రగతిని కాంక్షించే వారందరూ గుర్తుంచు కోవల్సిన అవసరం ఉంది..,

“..తెలుగు వాళ్ళు ముఖ్యంగా అభ్యుదయ ఉద్యమంలో పనిచేస్తున్న వాళ్ళకి సామాజిక పరిజ్ఞానం అత్యవసరం. భారతదేశంలో బానిస విధానం ఉండేదా ? ఏ రూపంలో ఉండేది? వంటి సమస్యలు పరిశోధకులవి. సాధారణుడైన తెలుగువాడి నిత్యజీవిత పరిజ్ఞానంలో వాని పాత్ర బహు దూరం.

కాని మనజీవితాన్ని ఆవరించుకుని ముందుకు అడుగువేయకుండా నిరోధిస్తున్న కొన్ని సమస్యలున్నాయి. వానిలో కులం ఒకటి. మానవులంతా ఒకటే. వారిలో హెచ్చుతగ్గులు లేవు, ఉండ కూడదనేవాళ్ళు కూడా కులం పేరు చెప్పేసరికి

బిగిసిపోతున్నారు."(ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర – 1, హెచ్.బి.టి, 1981) అంతే కాకుండా కంభంపాటి ఉద్గ్రంథాన్ని గురించి మరో మాట కూడా ఆయన అన్నారు : "ఈ ప్రశ్నలకు సమగ్ర సమాధానం ఉందనను కానీ, వీనిని అర్థం చేసుకునేం దుకు, సమాధానం ఊహించేందుకు కావాల్సిన సమాచారం నాకు కనబడింది."

అభ్యుదయోద్యమాలలో తలనెరసిన పెద్ద రచయిత మహీధర రామమోహనరావు గుర్తించినట్లు కంభంపాటి సత్యనారాయణ ఆంగ్ల గ్రంథం ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర : ఒక అధ్యయనం చారిత్రక ప్రాముఖ్యతను మరో అభ్యుదయరచయితకానీ, కమ్యూనిస్టు యోధుడు కానీ గుర్తించినట్లు నా దృష్టికి రాలేదు. ఆయనే ఈ గ్రంథాన్ని సంక్షిప్తాను వాదం కాకుండా సంపూర్ణాను వాదం చేసినట్లయితే ఆంగ్ల భాష తెలియని తెలుగు పాఠకులు వర్గ, కుల, మత వ్యవస్థల గురించి తమ పరిజ్ఞానాన్ని పరిపుష్టం చేసుకోవడానికి, అవగాహనను పెంచు కోవడానికి తగిన సమాచారం అందించినట్లయ్యేది. ఆంధ్రుల సమగ్ర చరిత్రకు మార్క్సిస్టు దృష్టితో నాంది పలికిన కంభంపాటి చరిత్ర గ్రంథం, ఈనాడు దేశం ఎదుర్కొంటున్న విచ్ఛిన్నకర శక్తులు – కుల, మతాల్ని అర్థం చేసుకొని వాటికి వ్యతిరేకంగా బహుముఖ పోరాటం చేయడానికి ఉపయోగపడుతుందని భావిస్తున్నాను..

ఇరవై సంవత్సరాల క్రితం ఆంధ్రలో తొలి కమ్యూనిస్టుల్లో ఒకరూ, అద్వితీయ చరిత్ర కారుడు,అభ్యుదయపాత్రికేయుడు,రచయితసంపాదకుడు,ఉద్యమశీలి కంభంపాటి సత్య నారాయణ సీనియర్ 21వ వర్ధంతి స్మారకోప న్యాసం సందర్భంగా 2004 లో విజయవాడ లో టి. రవిచంద్ చేసిన విలువైన ప్రసంగమే, తదనంతరం "ఆంధ్రుల చరిత్రలో నూతన ఆవిష్కరణలు" పేరిట విశాలాంధ్ర ప్రచురించింది. అందులోనివే పైన పేర్కొన్న అభిప్రాయాలు. అర్ధశతాబ్ద కాలంలో ఆంధ్రులపై అక్టోబర్ విప్లవ ప్రభావం అనే వ్యాసం మొదలు A Forgotten Intellectual of the South (విస్మరించబడిన దక్షిణ భారత మేధావి) పేరిట కె. బి. కృష్ణ గురించి కంభంపాటి మెయిన్ స్ట్రీమ్ లో రాసిన అమూల్య మైన వ్యాసం వరకూ ఈ చిన్న ప్రసంగంలో తడిమిన రవిచంద్,డా.ఎమ్. పట్టాభి రామిరెడ్డి అన్నట్లు, కంభం పాటిని "చరిత్ర కలిగిన చరిత్రకారుడి" గా పేర్కొన్నారు!

చాలా ఏళ్ళ క్రితం కంభంపాటిగారి A Study Of the History and Culture of the Andhras ను చదివి ఆ విస్తృతికి విస్తుపోయిన నాకు, చాలా రోజుల నుండి ఆ వర్క్ పై సమాలోచన జరిపి చర్చను పెట్టాలనే బలమైన ఆలోచన ఉండేది. ఈరోజు ఎవరో కొద్దిమందికిమాత్రమే తెలిసిన ఆ గ్రంథం దాదాపు మరుగున పడిపోయింది. తొంభైఏళ్ళ క్రితమే మార్క్సిస్టు దృక్పథంతో స్వతంత్రంగా ఈ దేశంలోని భావోద్యమాలని పరిశోధించి, కులనిర్మూలన కోసం నూతన పంథాను అనుసరించిన కె. బి. కృష్ణ వంటి మహా మేధావి కృషికి కూడా ఏవో ఆయన పుస్తకాలు ప్రచురించడం మినహా వామపక్ష శ్రేణులు న్యాయం చేయలేదు. కనీసం, భగత్ సింగ్, సుఖ్ దేవ్, రాజ్‌గురుల ఉరిశిక్షని ఖండిస్తూ కరాచీ కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ ప్రవేశపెట్టిన తీర్మానం ఆ యోధుల్ని అవమాన పరిచేలా ఉందని భావించి దానికి వ్యతిరేకంగా ఓటు వేసి కాంగ్రెస్ నుండి బయటకొచ్చి కమ్యూనిస్టుగా మారిన కంభంపాటి వంటి స్వేచ్ఛాలోచనా పరుడి స్ఫూర్తినైనా కాపాడుకోవల్సి ఉంది !

మద్రాసులో అమీర్ హైదర్ఖాన్ ఆద్వర్యంలో నిషేధిత పార్టీలో పనిచేసి వామపక్ష, సైద్ధాంతిక సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన అలాంటి మహావ్యక్తి, స్వతంత్ర చరిత్రకారుడు, పరిశోధకుడు, పాత్రికేయుడు, రచయిత, సిద్ధాంతకర్తా, ఉద్యమకారుడు, కార్యశీలిని విస్మరించడమంత విషాదం కమ్యూనిస్టు పార్టీకి మరోటి లేదు. ఈ స్మారకోపన్యాసం ప్రతి అంతర్జాలంలో అందుబాటులో ఉంది. లేదా ఆసక్తి ఉన్న మిత్రులు నా వాట్సప్ 90320 94492 కి రిక్వెస్ట్ పెడితే సాఫ్ట్ కాపీ నేనైనా పంపగలను. కాలక్షేపం కోసం కాకుండా, ప్రత్యామ్నాయ చరిత్ర రచన పట్లా, ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర ఉద్యమాల పట్లా ఆసక్తి, అధ్యయనం ఉన్న మిత్రులు కంభంపాటి సత్యనారాయణ గారి జీవితం, ఆచరణ పట్ల కృషి చేస్తే భావి తరాలకు ఒక భరోసాను కల్పించినవరౌతారని మనవి !

(2004 లో ఇచ్చిన ఈ ప్రసంగ పాఠాన్ని పదేళ్ళ తర్వాత 2013 లో రవిచంద్ ప్రేమగా నాకు  పంపారు. అప్పటికే ఈ ప్రసంగం నేను చదివి ఉన్నాను. ఇంకో

పదేళ్ళు కూడా గడిచి పోయాక ఇప్పటికి గానీ ఈ మాత్రం పరిచయానికి కూడా తీరింది కాదు. ప్రొ.హిరేన్ ముఖర్జీ, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, ప్రొ.కొత్త సచ్చిదానందమూర్తి, ప్రొ.వి. రామకృష్ణ వంటి ప్రముఖులు ఇచ్చిన కంభంపాటి సత్యనారాయణ గారి స్మారకోపన్యాసాలు అన్నిట్నీ పుస్తకంగా ప్రచురించారేమో నాకైతే తెలీదు కానీ, కంభంపాటి వంటి మహామేధావిని, ఆలోచనల్ని, శోధనల్ని విస్తృతంగా ప్రజల్లోకి తీసుకు వెళ్ళాల్సిన బాధ్యత అన్ని శ్రేణుల ప్రజాసంఘాలకు, బుద్ధి జీవులకూ ఉందని భావిస్తూ చాలా రోజులుగా అనుకుంటున్న ఈ పుస్తకం పై చిన్న రైటప్ !)

# తెలుగుజాతి వేగుచుక్క- తాతాజీ !



తాతాజీగా సాహిత్య లోకానికి పరిచితులైన తాపీ ధర్మారావు తెలుగు సారస్వతాన్ని సుసంపన్నం చేసిన మహా వ్యక్తులలో ఒకరు. "వెయ్యి ముఖాలతో వెలిగిన జీవితం. పూల బాటలు, ముండ్ల పుంతలు, అగాధమైన పల్లాలు, ఆకాశన్నంటే మెరకలు అన్నీ తొక్కుకుపోయిన జీవితం" ఆయనది. బరంపురంలో పుట్టిన బండారు ధర్మారావు తెలుగు నేలమీద తాపీ ధర్మారావుగా ప్రసిద్ది చెందారు. ఉత్తరాంధ్ర,ఒడిస్సా, తెలంగాణ, రాయలసీమ, తమిళ నాడు వంటి పలు ప్రాంతాల్లో, సంస్థానాలలో పనిచేసినాయన సాంస్కృతికోద్యమాల ప్రతిష్ఠను ఇనుమడింప చేసిన చుక్కాని. సాహిత్యం కవిత్వం, చిత్ర లేఖనం, గణితం, నాటకాలు,వ్యాయామం ఇలా పలు అంశాల్లో ఆసక్తి కనబర్చిన బహుముఖ ప్రజ్ఞాశాలి. చేమకూర వెంకటకవి గురించి సాధికారికంగా చెప్పగల ఏకైక వ్యక్తి. వేగుచుక్క గ్రంథమాల వ్యవస్థాపకులు. స్వతంత్ర పరిశోధకులు, సంఘ సంస్కర్త, మూఢ నమ్మకాలను చీల్చి చెండాడిన హేతువాది. సమదర్శని, కొండెగాడు, ప్రజా మిత్ర, జనవాణి, కాగడా వంటి పత్రికల ద్వారా ప్రజానీకానికి ప్రత్యామ్నాయ రాజకీయ భావాలను చేరువచేసిన పాత్రికేయులు. అంతే కాదు, తెలుగులో ప్రజా పక్షంగా ఆలోచించే పాత్రికేయులతో ' ఆంధ్ర రాష్ట్ర పత్రికా రచయితల సంఘ ' స్థాపకులు, దానికి మొదటి అధ్యక్షులు కూడా. ఇవన్నీ ఒకెత్తయితే, బ్రాహ్మణేతరోద్యమ తాత్విక ధోరణిని జీవితాంతం తన రచనా వ్యాసంగంలో కొనసాగించి, స్వతంత్ర అలోచనా విధానాన్ని బలోపేతం చేసిన ఆత్మగౌరవ ఉద్యమకర్తగా తాతాజీ ప్రస్థానం మరొకెత్తు!

పానుగంటి, గిడుగు వంటివారి ప్రభావంతో మొదట్లో గ్రాంథికవాదిగా ఉన్నప్పటికీ, తర్వాత కాలంలో చిరస్థాయిగా నిలిచి పోయే అనేక రచనల్ని సామాన్య ప్రజలకి చేరువయ్యే రీతిలో వ్యావహారిక భాషలో రచించిన చెయ్యి తిరిగిన రచయిత.

పాతపాళీ నుంచి కొత్తపాళీ లోకి కొనసాగిన పాతకొత్తల మేలు కలయిక తాతాజీ. "ఆయన రాసింది చూసి నేర్చుకున్నాం" అని నార్ల అంతటి వ్యక్తే చెప్పగలిగిన సామర్థ్యం తాపీ వారి సొంతం. సంజీవ్‌దేవ్ మొదలుకొని బోయి భీమన్న వరకూ ఆనాడు తాపీ వారి స్ఫూర్తి వెలుగులు ప్రసరించని వ్యక్తిత్వం లేదంటే అతిశయోక్తి కాదు. "ఉన్నది కన్నట్టు వ్రాయుటకన్న గవికి మేలు లేదు" అన్నాయన హేతువాద వైజ్ఞానిక దృక్పథాన్ని, ప్రశ్నించే స్వభావాన్ని ప్రచారం చేసిన తీరు అద్భుతం. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు ? ఇనుప కచ్చడాలు, పెళ్ళి – దాని పుట్టు పూర్వోత్తరాలు, తాతాజీ చేసిన ఈ మూడు రచనలు భావోద్యమాల చరిత్రని అనూహ్యంగా మలుపు తిప్పాయి. మానవ పురాచరిత్ర అధ్యయనం ద్వారా ఆయన శోధించి, వెల్లడించిన అనేక అపూర్వమైన విషయాలు, ఆయా రంగాల్లో ఎందరో అన్వేషకులకు, పరిశోధకులకు మార్గదర్శకంగా ఉపయోగ పడ్డాయి. ఆరుద్ర నుండీ తిరుమల రామచంద్ర వరకూ తాతాజీ ప్రేరణతో పరిశోధనల పై ఆసక్తి పెంచుకున్న మహామహులు ఎందరో ఉన్నారు. ఆ రకంగా తెలుగు సారస్వతాన్ని కొత్త పుంతలు తొక్కించిన ఘనత నిస్సందేహంగా తాతాజీదే. ఇవి కాక ఆలిండియా అడుక్కు తినేవాళ్ళ మహాసభ, ఇంకా కొన్ని నాటికలు రాసారు. రాలూ, రప్పలూ పేరుతో ఆత్మకథ రాసారు.తర్కబద్ధ మైన వ్యంగ్యం, సున్నితమైన హాస్యం రంగరించీ, భాషలో ఎన్నో కొత్త పదబంధాల్నీ, వాక్య నిర్మాణంలో ప్రయోగాల్నీ చేసారు. జన సామాన్యానికి చేరువయ్యే సరళమైన భాషకి పట్టం కట్టారు !

కందుకూరి, గురజాడ, గిడుగు వంటి వారి అడుగుజాడల్లో సాంస్కృతిక వారసత్వాన్ని కొనసాగించిన ఉద్యమకారుడు తాతాజీ. వేదం వెంకటరాయ శాస్త్రి అంతటి మహా పండితుడు రాసిన విజయ విలాస వ్యాఖ్యానంలో తప్పులు ఎత్తి చూపడమే కాకుండా, ఆంధ్రదేశంలో అనేకచోట్ల పండితులతో తన విమర్శ పై ప్రతివిమర్శల్ని ఆహ్వానిస్తూ సమావేశాలు నిర్వహించారు. అంతేకాదు, ఏకంగా వెంకట రాయశాస్త్రి గారు ఉండే నెల్లూరు లోనే సభ ఏర్పాటు చేసి అందరి చేత శహభాష్ అనిపించుకొని మన్ననలు పొందిన వ్యక్తి తాతాజీ. చల్లపల్లి రాజా వారి కుమారుడి అక్షరాభ్యాసం సందర్భంలో సాంప్రదాయ తంతుని నిరసిస్తూ, ఓనమాలుగా పిలువబడే

ఓం నమశ్శివాయ మంత్రానికి బదులు అ, ఆ లే రాయించి అక్షరాభ్యాసం చేయించిన ధైర్యశాలి. అది విమర్శించిన ఛాందసుల నోళ్ళు మూతపడేలా బహిరంగ చర్చకు సవాలు విసిరిన ధీశాలి. అంతేనా ! "చెప్పేదంతా తప్పుడు చదువేనా? తెలుగువారి అక్షరాభ్యాసంలో అవకతవకలు" అంటూ, విశ్లేషణాత్మక వ్యాసం కూడా రాసి మన విద్యావిధానంలోని లోపాలను సోదాహరణంగా ఆనాడే విమర్శించిన కార్యశూరుడు తాపీ ధర్మారావుగారు !

ఇంతకుమించిన ముఖ్యమైన చారిత్రక ఘటన మరొకటుంది. తమిళనాడులోని తిరునల్వేలి జిల్లా ఉర్కాడు సంస్థానంలో తాపీ వారు పని చేసేవారు. అక్కడ దేవీ నవరాత్రులు సందర్భంగా జరిగిన గోష్టిలో, తిరుగులేని ఆధ్యాత్మిక గురువైన శృంగేరి శారదా పీఠాధిపతి, జగద్గురు చంద్రశేఖర భారతీ శంకరా చార్యుల వారి ముందు తాతాజీ, భాష,లిపి మూలాల్ని తడుముతూ తాను రాసిన, "అక్షర శారదా ప్రశంస" అనే పద్య కవిత్వం చదివి వాహ్వా అనిపించుకుని, దుశ్శాలువాతో "ఆంధ్ర విశారద" అనే బిరుదు పొందారు. ఒక ప్రగతిశీల భావాలుగల వ్యక్తి హేతువాద దృష్టితో రాసిన కవితకి గానూ, తిరుగులేని ఆధ్యాత్మికవేత్త నుండి అంతటి సత్కారాన్ని అందుకోవడం అనేది అప్పటి వరకూ ఎన్నడూ జరగనిది. ఆ రకంగా భావోద్యమాలకి దక్కిన అరుదైన గౌరవం. బహుశా అందుకే, తర్వాత కాలంలో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు మొదలుకొని ఎన్ని బిరుదులు, సత్కారాలు తాతాజీని వరించినా, చివరి వరకూ ఆంధ్ర విశారద గానే కొనసాగారు !

ఎనభై ఏళ్ళ క్రితం 1943లో తెనాలిలో జరిగిన మొదటి అభ్యుదయ రచయితల సభలు మొదలు కొని యాభై ఏళ్ళ క్రితం 1970లో విశాఖలో జరిగిన శ్రీ శ్రీ షష్టిపూర్తి సభలకి కూడా ఆరోగ్యం అంతగా సహకరించకపోయినా వచ్చి అధ్యక్ష స్థానంలో దిశానిర్దేశం చేసిన క్రియాశీలి తాతాజీ. వందల సంఖ్యలో ఆదర్శ వివాహాలు చేసారు. సొంత కుటుంబం నుండే ప్రజాతంత్ర భావాలకిగాను పెద్దపీట వేశారు. వామపక్ష సానుభూతిపరుడిగా ఎదిగారు. టాల్ స్టాయ్ రచన అన్నాకెరినాను తెలుగులోకి అనువదించారు. మద్రాసులో రాజాజీ హాల్లో తెలుగు సంస్కృతీ సభల్లో అధ్యక్ష ఉపన్యాసం చేస్తూ, "సంస్కృతి అంటే మానవుడు స్వయంకృషి వలన

అలవర్చుకునే ప్రతీదీ అని అర్థం. స్వయం గుణాలు, ఇనిస్టింక్టులు, ఆ తర్వాత మనిషి సంపాదించుకునే విజ్ఞానమే సంస్కృతి." అంటారు. అలా సాంస్కృతిక వికాసానికి తనవంతు కృషి చేసిన తాతాజీ చలనచిత్ర రంగంలో కూడా తన ముద్ర వేశారు. మాలపిల్ల, రైతుబిడ్డ, ఇల్లాలు, రోజులు మారాయి, కీలు గుర్రం, పల్లెటూరి పిల్ల, కృష్ణ ప్రేమ, పరమానందయ్య శిష్యుల కథ మొదలైన సినిమాలకి సంభాషణలు రాసారు. ఆంధ్రదేశంలో వెల్లువెత్తిన ప్రతీ నూతన ఆవిష్కరణనీ నిబద్ధతతో తనవంతు పరిపుష్టం చేసిన మహావ్యక్తి తాతాజీ. అందుకే ఆయన జయంతి ఐన సెప్టెంబరు 19ని తెలుగు మాధ్యమాల దినోత్సవంగా జరుపుకుంటాం !

చాలా కాలంపాటు మద్రాసులో ఉన్నాయన తర్వాత హైదరాబాదుకి మకాం మార్చారు. చివరివరకు సాహిత్యసభలు, సమావేశాలు, పుస్తక ప్రచురణలు, మిత్రులతో పిచ్చాపాటీ, ఇవికాక కాఫీ, పొగాకు చుట్ట కూడా వదల్లేదు. భార్య అన్నపూర్ణమ్మ చనిపోవడం ఆయనకి పెద్ద లోటు. అయినా నెమ్మదిగా కూడదీసుకున్నారు. అప్పటికే ఎగ్జిమా,ఆస్తమా వంటి అనారోగ్య సమస్యలతో బాధపడుతున్న ఆయన, 1973 మే 8 న హైదరాబాదులోని కుమారుడి ఇంట్లోనే తుదిశ్వాస విడిచారు. తెలుగు సాహిత్యాన్ని తనదైన ఒరవడిలో ఓలలాడించి, ప్రగతిశీల ఉద్యమాలన్నింటి మీద ధిక్కారపు వెలుగుల్ని ప్రసరించిన "వేగుచుక్క' గా తెలుగు ప్రజల గుండెల్లో 'తాతాజీ' గా ఎప్పటికీ నిల్చిపోతారు. "తాపీ ధర్మారావు, జీవితం – రచనలు" పేరిట విశాలాంధ్ర ప్రచురించిన డాక్టర్ ఏటుకూరి ప్రసాద్ గారి పరిశోధనా ఉద్గ్రంథం తాతాజీ జీవితానికి సంబంధించిన వివిధ పాశ్వాల్ని సమగ్రంగా దర్శించేందుకు జరిగిన ఒక విశిష్ట ప్రయత్నం. ప్రతీ కవి, రచయిత, కళాకారుడు, తత్వవేత్త, పాత్రికేయుడు, పరిశోధకుడు, ప్రగతిశీల అభ్యుదయ ఆలోచనాశీలి తప్పనిసరిగా తెలుసుకుని తీరాల్సిన విశిష్ట వ్యక్తిత్వం తాపీ ధర్మారావు గారిది. తెలుగు నేల మీద ఆయన వికసింపజేసిన భావాల ప్రభావం అపారం. భావితరాలు కూడా ఆ మేధోసంపత్తి నుండి స్ఫూర్తిని పొంది మూఢత్వపు చీకట్లను చీల్చే ఆయన అక్షర కాంతుల సాయంతో తెలుగు సారస్వతాన్ని సమున్నతంగా నిలిపేలా కృషి చేయడమే ఆయనకి ఇవ్వదగ్గ నివాళి !

(మే 8 తాతాజీ 50 వ వర్ధంతి సందర్భంగా)

# తెలుగుజాతి సారస్వత శిఖరం!



కొమర్రాజు వెంకట లక్ష్మణరావు. తెలుగు జాతి శాశ్వతంగా గుర్తుంచుకోవలసిన శిఖరాగ్ర సమానుడు. విజ్ఞానశాస్త్రం, చరిత్ర, భాషా సంస్కృతి, పరిశోధన, సాహిత్యం, ప్రచురణ, సాంస్కృతిక, సారస్వత రంగాల్లో అసాధారణమైన కృషి చేసి, మన తరాలకు అర్థవంతమైన మార్గం చూపిన మహనీయుడు. ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాల మధ్య సౌహార్ద్ర సయోధ్యకి పాటుపడిన అపర మేధావి. అధ్యయనశీలి, విశేషజ్ఞాన సంపన్నుడు, ప్రజాప్రయోజనాల కోసం జీవితాన్నే అంకితం చేసిన అసామాన్య బుద్ధిజీవి. కృష్ణాజిల్లా పెనుగ్రంచిపోలులో 1876లో జన్మించిన ఆయన విద్యాభ్యాసం తెలంగాణ, మహారాష్ట్ర ప్రాంతాల్లో సాగింది. నాగపూరు, కోల్‌కతాల నుండి బి.ఎ, ఎం.ఎ. లు పూర్తిచేసినాయన చిన్నతనంలోనే మరాఠీ లో అనేక రచనలు చేశారు. మద్రాసులో న్యాయశాస్త్రం చదివారు. విద్యార్థి దశలోనే సమాచార్, వివిధ విజ్ఞాన్ విస్తార్ వంటి మరాఠి పత్రికలకి సంపాదకత్వం వహించ డమే కాదు, కేసరి, మహారాష్ట్ర వంటి పత్రికల్లో జరిగే చర్చలు, వాదోపవాదాల్లో కూడా చురుకుగా పాల్గొన్నారు. మరాఠీ భాష, సంస్కృతి పై మమకారం పెంచుకున్నారు!

తెలుగులో జనరంజని పత్రిక నడిపారు. విజయవాడ క్రైస్తవ కళాశాలలో పనిచేస్తూ స్త్రీ విద్యావ్యాప్తి కోసం అప్పట్లో రాయసం వెంకట శివుడు ఆధ్వర్యంలో వెలువడిన 'తెలుగు జనానా' పత్రికలో లక్ష్మణరావు గారు, ఆయన సోదరి అచ్చమాంబ గారు కూడా రాసేవారు. తెలుగులో వైజ్ఞానిక దృక్పథాన్ని ప్రచారం చేస్తూ అందులోనే లక్ష్మణరావు గారు మొదటిసారి 'విశ్వం యొక్క విరాట్ స్వరూపం' అనే వ్యాసం రాసారు. అప్పట్లో అదొక సంచలనం. లక్ష్మణరావుగారి ఉన్నతికి అక్క

అచ్చమాంబగారి ఆదరణ ఎంత ఉన్నదో, తొలి కథా రచయిత్రిగా, స్త్రీవాదిగా, సంస్కర్తగా అచ్చమాంబ గారు ఉన్నత వ్యక్తిత్వం సంతరించు కోవడంలో లక్ష్మణరావుగారి ప్రోత్సాహం అంతే ఉంది. వారిరువురి అనుబంధం అంత గొప్పది. ఇదంతా ఒకెత్తయితే బ్రిటిష్ తత్వవేత్త హెర్బర్ట్ స్పెన్సర్ అజ్ఞాత వాదాన్ని విశ్వశించిన లక్ష్మణరావు గారు మతాతీత లౌకికవాద సిద్ధాంతాన్ని జీవితాంతం అనుసరించడమూ, ఏ ఇతర మార్గంపైనా కూడా కించిత్తు ద్వేష భావం లేకుండా ప్రవర్తించడం ఒకెత్తు. అందుకే, "ఒకరి మతము లొకరికి అసమ్మతములగుట స్వాభావికము. ఇంత మాత్రముచే నొకరినొకరు నిందింప కూడదు." అంటారు. అంతేనా, "..ముసల్మానులీ దేశ వాసులైనందున ప్రస్తుతమున్న హిందూ ముసల్మానులన్నదమ్ములు.." అన్నారు. భాషా ద్వేషాలు, పరమత అసహనాలు కొనసాగుతున్న వర్తమాన కాలంలో ఇదెంత విలువైన మాటో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు !

సంపూర్ణ స్వాతంత్ర్య సాధనే లక్ష్యమనే నినాదంతో దాదాభాయి నౌరోజీ అధ్యక్షతన కోల్ కతాలో 1906లో జరిగిన మహాసభలో నాయని వెంకట రంగారావు, హరిసర్వోత్తమరావుగారితో పాటూ కొమర్రాజు లక్ష్మణరావు కూడా పాల్గొన్నారు. తెలుగు జాతి సాంస్కృతిక వికాసాన్ని కొత్త పుంతలు తొక్కించిన కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి వంటి వారి అడుగుజాడల్లో నడిచిన సంస్కర్త లక్ష్మణరావు గారు. హైదరాబాదులో ఈనాటికీ కొనసాగుతోన్న శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయాన్ని స్థాపించడం మొదలు, విజ్ఞాన చంద్రికా మండలి, విజ్ఞాన చంద్రికా పరిషత్తు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, పరిశోధకమండలి తదితర మహాసంస్థల్లో ఆయన నిర్వహించిన కార్యాలన్నీ సర్వోన్నత మైనవే. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి విశిష్ట రచన 'అబ్రహం లింకన్' మొదలుకొని కందుకూరి వీరేశలింగంగారి స్వీయచరిత్ర వరకూ తెలుగు వారికి విశిష్టమైన గ్రంథాల్ని అందించినఘనత నిస్సందేహంగా కొమర్రాజు వారిదే. సంఘ సంస్కరణోద్యమాల్ని కూడా స్వాగతించిన ఆయన రాత్రిబడుల్లో స్వయంగా పాల్గొని చదువు చెప్పారు.

దళిత బహుజన బలహీన వర్గాల ప్రజల ఉన్నతిని నిబద్ధతతో ఆకాంక్షించారు. స్త్రీ విద్య, వితంతు వివాహాలు, సహ పంక్తి భోజనాలకి సహకారం అందించారు. మద్రాసులో శ్రీనివాసయ్యంగారి సారధ్యంలో నడిచిన దక్షిణ హిందూ దేశ సంఘ సంస్కరణ సంఘం కార్యక్రమాలలో చురుకుగా పాల్గొన్నారు !

చరిత్ర రచన పట్ల హేతువాద వైఖరిని అవలంబించిన ఆయన, గతాన్ని తవ్వి తీయడం సమకాలీన సమాజాన్ని సర్వోదయంగా మల్చుకోడానికే తప్పా గతంలోనే బతకడానికి కాదనే సందేశాన్ని భావి చరిత్ర పరిశోధకులకు అందించారు. తెలుగు చరిత్ర పరిశోధక పితామహులుగా కీర్తి గడించారు. ఐతే, వీటన్నింటిలోకీ కొమర్రాజు లక్ష్మణరావు గారికి శాశ్వత కీర్తిని ఆర్జించింది మాత్రం ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ నిర్మాణం. ఆంగ్లంలో ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా వంటి అపారమైన మహా విజ్ఞాన భాండాగార సర్వస్వాన్ని తెలుగు జాతికి కూడా అందించాలనే సదాశయంతో, అనితర సాధ్యమైన ఆ మహాకార్యాన్ని అంకిత భావంతో సుసాధ్యం చేసి చూపిన కార్యశీలి కొమర్రాజు. యావత్ భారతదేశంలోనే మొదటిసారి అంతటి మహత్కార్యానికి స్వీకారం చుట్టినవారు అప్పటికి మరొకరు లేరు. భాషా సాంస్కృతిక వికాసోద్యమాలకి పేరెన్నికగన్న మరాఠీలో 'విజ్ఞాన్ సర్వస్వ' నిర్మాణానికి పన్నెండేళ్ళు పట్టింది. బెంగాళీలో 'విశ్వకోశ్' తర్వాత వెలువడింది. కానీ, కొమర్రాజు వారి తెగింపుతో తెలుగులో అసమగ్రంగానే ఐనా మూడు సంపుటాలుగా విజ్ఞాన సర్వస్వం వెలుగు చూసింది. ఆ మార్గంలో ఇతర జిజ్ఞాసువులకు ఒక దారిదీపంగా ప్రయోజనం చేకూర్చింది. కొమర్రాజువారు చిన్నవయసులో మరణించకుండా ఉండుంటే ఆ మహోన్నత కార్యాన్ని ఖచ్చితంగా పరిపూర్తి చేసుండేవారు!

తెలుగులో విజ్ఞాన శాస్త్రాల ప్రచురణకి నాంది పలికి పదార్థ శాస్త్రం, రసాయన శాస్త్రం, జంతు శాస్త్రం, మానవ పరిణామ శాస్త్రం, వృక్ష శాస్త్రం, అర్ధ శాస్త్రం, భూగోళశాస్త్రం.. వంటి ఎన్నో విలువయిన గ్రంథాలను లక్ష్మణరావు గారు ప్రచురించారు. ఆయన స్వయంగా శివాజీ చరిత్ర మొదలుకొని, హిందూ

మహాయుగము, మహమ్మదీయ మహా యుగము వంటి రచనలు చేసారు. ఎన్ని మహత్కార్యాలు చేసినా కొమర్రాజు గారు ప్రచారాన్ని ఆశించలేదు. గ్రంథాల్లోనూ, సంస్థల మనుగడలోనూ ప్రజాస్వామ్య దృక్పథాన్నే అవలంబించారు. "జ్ఞానమొక భాష యొక్క యబ్బ సొమ్ము కాదు" అని ధైర్యంగా నినదించిన ఆయన వ్యవహారిక భాష విషయంలో మాత్రం విజ్ఞత ప్రదర్శించ కుండా, సాంప్రదాయవాదిగా మిగిలి పోవడం బాధాకరం. ఆ ఒక్క అంశం మినహా, ఆయనలో వేలెత్తి చూపేందుకు మచ్చుకు కూడా అవకాశం లేదు. అయ్యదేవర కాళేశ్వరరావు మొదలు ఆదిపూడి సోమనాథ రావు గారి వరకూ, ఆచంట లక్ష్మీపతి గారి నుండి ఆదిరాజు వీరభద్రరావు గారి దాకా, గాడిచర్ల హరి సర్వోత్తమ రావు గారి నుంచీ మాడపాటి హనుమంతరావు గారి దాకా, , కట్టమంచి రామలింగారెడ్డి గారు, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు, రావిచెట్టు రంగారావు గారు, రాయప్రోలు సుబ్బారావు గారు వంటి విశిష్ట వ్యక్తులెందరో కొమర్రాజు లక్ష్మణరావు గారి వ్యక్తిత్వం నుండి స్ఫూర్తి పొందినవారే. శక్తివంచన ఎరుగని వ్యక్తిగా, తెలుగు వారి సారస్వత వికాసానికి జీవితాంతం ఎనలేని కృషి చేసిన మహాశక్తిగా జీవించినాయన జూలై 12, 1923 అర్ధరాత్రి నలభై ఆరేళ్ళ వయసులో ఉబ్బసం వ్యాధితో అకాల మరణం చెందడం తెలుగు జాతి సారస్వత స్రవంతికి తీర్చలేని, వేరెవరూ పూడ్చలేని లోటుగా మిగిలిపోయింది !

(జూలై 12 కొమర్రాజు లక్ష్మణరావు గారి శతవర్ధంతి నివాళి)

# నిఖార్సయిన విశ్వకళాతపస్వి
# నికోలస్ రోరిక్

( అద్వితీయ మహా జిజ్ఞాసి మహత్తర కృషి)

వ్యక్తిత్వానికి ముందు ఎన్ని విశేషణాలనైనా చేర్చండి. వాటన్నిటికీ సరిపోయే అసాధారణ పేరది. జీవితం గురించి ఎన్ని విశిష్టతలనైనా పేర్చండి. అన్నిటికీ అలవికాని వన్నెతెచ్చే అఖండమైన ప్రయాణం ఆయనది. ఆయనో అద్భుతమైన సౌందర్యారాధకుడు, కవి, రచైత, తత్వవేత్త, స్వాప్నికుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి, సామాజిక కార్యకర్త, పురాతత్వశాస్త్రవేత్త, సత్యాన్వేషకుడు, ప్రత్యామ్నాయ ఆధ్యాత్మిక వాది, ఆచరణవాది, ప్రపంచ శాంతి ఉద్యమ కారుడు, అనుభవవాది, అద్వితీయ















చిత్రకారుడు, అనేక సంస్థల వ్యవస్థాపకుడు, మతాలన్నింటినీ శోధించి నైతిక మార్గం ముఖ్యమని నమ్మినవాడు. 'రోరికిజం' ఆధ్యాత్మికత, సామాజికతల వినూత్న సిద్ధాంతం. ప్రపంచ వ్యాప్తంగా చికాగో, న్యూయార్క్ వంటి చోట్ల అంతెత్తునున్న అనేక అంతస్తుల్లో ఆయన పేరిట కొనసాగుతున్న కళా ప్రదర్శనలు రోరిక్ విశిష్టతకి విలువైన చిహ్నాలు. మార్మిక మతవాది, అగ్నియోగ సృష్టికర్త, అన్నిటీ మించి హిమాలయ ప్రకృతి ప్రేమికుడు, భారతీయతలోని అవిభాజ్యమయిన చింతనాశీలతను పరిపూర్ణంగా అర్థం చేసుకున్న మానవీయ దార్శనికుడు !

రోరిక్...నికోలస్ రోరిక్ ... భారతదేశపు ఆత్మని కళాత్మకంగా చిత్రించగల రవివర్మ మొదలు రవీంద్రనాథ్ టాగోర్ వంటి అతి కొద్దిమంది ఈ దేశపు చిత్రకారుల సరసన నిల్చిన ఏకైక కళాసౌందర్య యోధుడు. మహాత్మా గాంధీ మొదలు మహా వైజ్ఞానిక శాస్త్రవేత్త ఐన్ స్టీన్ వరకూ, లెనిన్‌తో మొదలెడితే రూజ్‌వెల్ట్ దాకా విశ్వవ్యాప్తంగా ఆలోచనాపరులు ఎందరో్ని ఆకర్షించిన మహా వ్యక్తిత్వం ఆయనది. ఇవన్నీ ఒకెత్తయితే, తెలుగులో అద్వితీయ సౌందర్యో పాసకుడిగా, కళా తాత్వికునిగా నిల్చిపోయిన సంజీవ్ దేవ్ గురువుగా తెలుగు వారితో ఆయనకున్న సంబంధం మరొకెత్తు. సంజీవ్ దేవ్ అత్యంత సన్నిహితంగా మెలిగిన వ్యక్తుల్లో రోరిక్ ఒకరు. దేవ్ వివాహం నాటికి మరణించిన రోరిక్,



భార్య హెలీనా ద్వారా తాను వేసిన హిమగిరుల చిత్రాన్ని బహుమతిగా పంపించిన ఘటన, రోరిక్ తో దేవ్ ఉత్తర ప్రత్యుత్తరాలు వంటి హృద్యమైన ఘటనల్ని సంజీవ్ దేవ్ గారి రచనల్లో కూడా చూడొచ్చు. హిమాలయాల్ని ప్రేమించడం మాత్రమే కాదు, ఆ అనంత శిఖరాలలో అడుగడుగూ సంచరించి అక్కడి వాతావరణ స్థితిగతులనూ, చెట్టు, చేమ, పశువు, పక్షి, గడ్డి, గాదం వంటి ప్రజాజీవన క్షేత్రాల్ని క్షేత్రస్థాయిలో చదివి ఆ సేకరించిన సమాచారాన్ని భద్రపరచిన అరుదైన ఔత్సాహికుడు!




రష్యాలోని సెయింట్ పీటర్స్ బర్గ్ లో జన్మించాడు. తండ్రి జర్మన్,తల్లి రష్యన్. రోరిక్ కవిత్వం, చరిత్ర, నిర్మాణశాస్త్రం, న్యాయ శాస్త్రం, కళల పట్ల ఆసక్తి కనబరిచేవాడు. 24 ఏళ్ళ వయసు లోనే 'కళా జగతి' (Mir iskusstva /world of art) పత్రిక్కి సహసంపాదకుడిగా పనిచేశాడు. మొదట్లో రష్యా విప్లవాన్ని దగ్గరుండి సమర్థించిన రోరిక్, మాక్సిమ్ గోర్కీతో పాటు గోర్కీ కమీషన్‌లో కూడా పనిచేశాడు. సోవియట్ ప్రభుత్వానికి అత్యంత సన్నిహితంగా మెలిగి కూడా అధికారిక పదవుల్ని కాదనుకున్నాడు. తర్వాత కళా సాంస్కృతిక విలువల పరిరక్షణకు సంబంధించిన బోల్షెవిక్ పాలసీతో విభేదించాడు. లెనిన్ అనుసరించిన విధానాలను వ్యతిరేకించాడు. దాంతో ఒత్తిడి మొదలైంది. తర్వాత ఫిన్‌లాండ్ వలస పోయాడు. అప్పుడే బౌద్ధం, ఉపనిషత్ వేదాంత దర్శనాలు, రామకృష్ణ పరమహంస, వివేకానంద రచనలు ఆయన్ని ఆకర్షించి జీవన సహచరి హెలీనాతో పాటు సమాంతర నూతన ఆధ్యాత్మిక తాత్విక చింతన పట్ల ఆసక్తి కలిగించాయ్ !

ఆ దిశగా ఆయన చేసిన కృషి పేర్కొంటే అదొక ఉద్గ్రంథం అవుతుంది. మధ్య ఆసియా దేశాలు, యూరోప్, మంగోలియా, స్కాండేవియా, ఫిన్లాండ్, చైనా, అమెరికా, లండన్, టిబెట్, జపాన్...ఒక్క చోటు కాదు, ఒక్క దేశమని లేదు. ప్రపంచంలోని

వివిధ తాత్విక పద్ధతుల్ని పరిశీలనాత్మకంగా శోధించిన ఆయన వందేళ్ళ క్రితం 1923 లో ఇక్కడి హిమాలయాలతో పీకల్లోతు ప్రేమలో పడిపోయాడు. అంతే, కాశ్మీర్, లద్దాఖ్, పంజాబ్, సిక్కిం, స్పిటీ, లాహౌల్ వంటి హిమ ప్రాంతాలు తిరిగుతూ కులూ లోయకు దాసోహమయ్యాడు. 'ఉరుస్వతి' పేరిట ఏకంగా హిమాలయ పరిశోధక విశ్వవిద్యాలయం స్థాపించి అనితర సాధ్యమైన కృషి చేశాడు. పత్రికతో సహా అనేక పరిశోధక గ్రంథాలు వెలువరించాడు. భాషా, సంస్కృతుల్నీ, చారిత్రక పరిణామాల్నీ పరిశోధించాడు. హిమాలయాల్ని రోరిక్ ఎంత పిచ్చిగా ఆరాధించాడంటే, ఏకంగా (7000 ) అక్షరాలా ఏడువేల చిత్రాల్లో హిమ శిఖరాల సౌందర్యాన్ని ప్రోది చేశాడు. భారతదేశంలోనే కాదు, ప్రపంచంలో ఏ ఇతర దేశంలోనూ కాకలుతీరిన ఏ కళాకారుడు/ చిత్రకారుడూ కూడా కనీసం ఊహించ సాహసించని అపార నిరంతర కృషి ఇది !

ఆయన అభిప్రాయాలు కొన్నింటితో వ్యక్తిగతంగా భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. యోగ, టెలీపతి, శంభాలా వంటి రోరిక్ భావాలు నాకు నచ్చవు. అలాంటి అశాస్త్రీయ పద్ధతులు ఉన్నా, చివర్లో సైన్సు పట్లా, తాత్వికాన్వేషణ పట్లా ఆయన కనబర్చిన దృక్పథం , చేసిన కృషి తెలిస్తే విస్మయానికి లోనవక మానం. అగ్ని యోగ పేరిట మతాన్ని నైతికతకి జోడించడం రోరిక్ చేసాడు. జవహర్లాల్ నెహ్రూ కుటుంబంతోనూ, ఇందిరాగాంధీతోనూ సన్నిహిత సంబంధాలు కలిగి ఉన్న రోరిక్ కొడుకులు యూరీ నికోలవిచ్ రోరిక్, స్వెతోస్లవ్ నికోలవిచ్ రోరిక్, భారతీయ చిత్రరాజాన్నేలిన నటి దేవికా రాణీ కోడలితో సహా మొత్తం కుటుంబం హేతుబద్ధ జ్ఞానానికి, చింతనాత్మక సంశోధనకి ఇచ్చిన గౌరవం, చేసిన కృషి అపూర్వం. అలాంటి మహాకృషికి తగిన ప్రదేశంగా రోరిక్ ఎంచుకున్న ప్రాంతాన్ని దర్శించాలని ఎన్నాళ్ళగానో అనుకుంటున్నాను. అనుకోని తీరిక వల్ల మొన్ననే ఆ కల తీరింది. మిత్రుడు సతీష్‌తో కలిసి కులూ లోయలోని నగ్గర్ గ్రామంలో అంతెత్తునున్న దేవదారు వృక్షాల మధ్య ఆయన స్మృతిలో గౌరవచిహ్నంగా, ఆ దారికి పేరు పెట్టిన "రోరిక్

మార్గ్" లో, ప్రపంచ కళాభిలాషుల స్వప్నం, సౌందర్యో పాసకుల స్వర్గం, కళనీ, ముఖ్యంగా చిత్రకళని ప్రేమించే వారు, హిమసీమల్ని ఆరాధించేవారు తప్పని సరిగా చూడవలసిన దర్శనీయ స్థలం,రోరిక్ ఎస్టేట్. అంతర్జాతీయ రోరిక్ స్మారక ట్రస్ట్ (International Roerich Memorial Trust) ఆధ్వర్యంలో ఆర్ట్ గ్యాలరీ, ఫోక్ ఆర్ట్ మ్యూజియం చూసొచ్చేసాను. అక్కడే తన చిత్తరువులతో ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేసిన పంజాబ్‌కి చెందిన గురుప్రీత్ సింగ్ అనే యువ ఔత్సాహిక చిత్రకారుడ్ని కలిసాం. బడలికతోనే అయినా భారతీయ తాత్విక, సాంస్కృతిక చరిత్రని సుసంపన్నం చేసిన రోరిక్ దంపతుల స్మృతి చిహ్నాల్నిలా నెమరేసు కుంటూ, ఆయన కృషి కోసం ఈ చిన్న రైటప్ !

(పర్యటన మనలోని పరవశత్వానికి పరిమళం అద్దితే, అన్వేషణ మనలోని అహంభావాలని అంతం చేస్తుంది. ప్రయాణం మనిషి ప్రగతిపథం. మనలోని అవాంఛ నీయతల నిర్మూలనం, వ్యక్తావ్యక్త అనుభూతుల సమ్మేళనం. ఆంతరిక కళాత్మకతకి, బాహ్య సౌందర్యానికి సంధానం. అలా ఎప్పటినుండో అనుకుంటున్న ఓ సుదీర్ఘ ప్రయాణం, జీవన యానంలో సాకారమైంది. హిమాలయాలలో చేసిన కొన్ని చిన్నపాటి ట్రెక్కింగ్‌లతో పాటు ఎక్కడో పుట్టి మరెక్కడో చదివి అనేక దేశాలు తిరిగి ఇక్కడ ఇండియా హిమాలయ పర్వత శ్రేణుల మధ్య సంచరించీ, స్థానిక సంస్కృతుల్ని లోతుగా అధ్యయనం చేసి, ఇక్కడి ప్రజల్ని ప్రేమించి,వారితోనే జీవించి,భారతీయ తాత్వికత లో తాదాత్మ్యం చెంది, ఇక్కడి మట్టిలో మమేకమైపోయి విశ్రమించిన ఒక మహత్తర మానవుడు చేసిన అసాధారణ కృషి, అపారమైన శోధన, అనంత మైన అన్వేషణలకి ఈనాటికీ నిలిచి ఉన్న ప్రాసంగికతని ప్రాపంచిక నైతిక విలువల వెలుగులో సుస్థిరంగా నిలుపు కోవడం అవసరమనే అభిలాషే ఈ అక్షరకాంక్ష. అదే విశ్వనరుడిగా ఎదిగిన నికోలయ్ కాన్స్టాం టినోవిచ్ రోరిక్ (1874 – 1947) 150వ జయంత్యుత్సవం సందర్భంగా ఆ మహావ్యక్తి స్మృతికి మనం ఇవ్వదగ్గ మనస్విత నివాళనేది నా అభిప్రాయం !)

# 'చౌరీచౌరా' ఘటనకి వందేళ్ళ సందర్భం !

## కవిత్వానికీ, కదనరంగానికీ మధ్య ఒక కవి !

## (మహాకవి, ప్రజాకవి, గోరఖ్ పాండే స్మృతిలో)

"హమ్ భరత్ ప్రసాద్, చమార్, అస్పృశ్య..."



ఉత్తర భారతదేశంలోని మౌ ప్రాంతంలో దేవరియా నుండి మరింత లోలోతుల్లో, విశాలమైన పచ్చిక బయళ్ళ మధ్య, అనూహ్యమైన వింత మలుపుల్లోకి దారితీసిన మారుమూల గ్రామంలో పరిచయం చేస్కునే పేరుకి ముందు కూడా కులం చెప్పి తనని తాను అస్పృశ్యుడిగా చెప్పుకున్న ఆ భరత్ ప్రసాద్ అనబడే పెద్దాయన మమ్మల్ని అడిగాడు,

ఎవరి కోసం వచ్చారు ?

"దాదా, హమ్ లోగ్  పాండేజి కా ఘర్ దేఖ్ నే కె ఆయేతే.... (మేం పాండే గారి ఇల్లు వెతుక్కుంటూ వచ్చాం..")

"కౌన్ పాండే బేటా...(ఏ పాండే బిడ్డా..?)

" గోరఖ్ పాండే..కవీ !"

అప్పటివరకూ కూర్చున్న దాదాపు ఏడుపదులు దాటిన ఆయన వెంటనే అటెన్షన్లోకి వచ్చేసాడు. కళ్ళల్లో ఆర్ద్రత నిండిన మెరుపు, గొంతులో చెమ్మతో కూడిన ప్రేమ. గోధుమ దుప్పటిలా పర్చుకున్న 'పండిత్ కి ముండేరా"


[illegible] गोरख पां[illegible]
आत्महत्या की
जनसत्ता संवाददाता
[illegible]
Jan Satta
30/1



అనబడే ఆ పొలాల మధ్యనున్న గ్రామంలో ఆ పేరు మేం చెప్పగానే అతడన్న మొట్టమొదటి మాట,

“భగవాన్ హై బేటా...భగవాన్”
(దేవుడయ్యా...ఆయన దేవుడు !)

నా రెండు దశాబ్దాల కల. కవిత్వం అంటే ఏదో కెలకటం కాదనీ, పదాల్ని అదును చూసి పాలక వర్గంపై, అన్యాయం, ఆధిపత్యం, అసమానతల పై సంధించడమనీ, భాషను శోషితుల పక్షం వహించేలా నిర్మించడమనీ, అసహాయుల ఆర్త నాదాలకి అక్షరాన్ని గొంతుగా మార్చడమని ప్రకటించిన మహాకవి, ఆలోచనాపరుడు, సామాజిక కార్యకర్త, ప్రజాతంత్ర తాత్వికుడు, సాంస్కృతికోద్యమశీలి “గోరఖ్ పాండే” జన్మభూమిని సందర్శించాలనేది, సుమారు డెబ్భై ఏళ్ళ క్రితం పుట్టి, బి. హెచ్. యు. మొదలు జె. ఎన్.యు. వరకూ విశ్వవిద్యాలయాల ప్రగతి శీలతకి తిరుగులేని ప్రేరకుడిగా నిలిచి ముప్పై సంవత్సరాల క్రితం మరణించిన అద్వితీయ ప్రజాకవి గోరఖ్ పాండే జీవితం ఉల్కాపాతం !

సాంప్రదాయ బ్రాహ్మణాధిక్యతతో కుళ్ళిన ఆ భూస్వామ్య కుటుంబంలో ఆ రోజుల్లో ఎంతటి సనాతన ఆచారాలుండేవో ఊహించడానికి ఈనాటికీ తోకలు, పిలకలతో ఉన్న మనుషుల్ని చూస్తే చాలు. అలాంటి కుటుంబంలో పుట్టిన గోరఖ్ అసాధారణ స్థాయికి ఎదిగాడు. దళితబహుజన వాడలే అతడికి అక్షరాభ్యాసం చేసాయ్.శ్రమజీవుల కడగళ్ళు, కష్టాలే అతడికి దిక్సూచిని అందించాయ్. మాయమైపో వలసిన అద్భుతమైన అనేక వాడ పాటలకి ప్రాణం పోసాడు. మచ్చలా మిగిలిపోయిన కులతత్వాన్ని మనస్ఫూర్తిగా విసర్జించి మనిషిగా మారాడు. అణగారిన ప్రజల వైపు నిలవడమే జీవిత సారమని నమ్మి దానినే గొంతెత్తి నినదించాడు. మహామనిషై ప్రజాకవిగా పునర్జన్మించాడు !




ఏవత్ దేశంలోనే భోజ్పురి భాషలో ఏకైక ప్రజాకవి. అసామాన్య ఆలోచనాపరుడు. దుర్మార్గ పాలనని చీల్చి చెండాడిన వాడు. పురుషాధిక్యత, బ్రాహ్మణాధిపత్యం, పెట్టుబడిదారీ విధానాలపై సూటైన పదాలతో, ఘాటైన పాదాలతో, ధాటిగా ఎక్కుపెట్టిన మేటి వ్యంగ్య కవిత్వం గోరఖ్ ది. ఒక్క యూపీ మాత్రమే కాదు, ఢిల్లీ, బిహార్, హర్యానా, ఎం.పి. చత్తీస్‌గఢ్, మహరాష్ట్ర, తెలంగాణ వరకూ హిందీ, భోజ్ పురి లో దేశంలో నలువైపులా ఉన్న విశ్వవిద్యా లయాల్లో ఎక్కడ ఉద్యమాలు ఎలుగెత్తినా, ఆ చెలరేగే నినాదాల్లో అతడి పేరే వినిపిస్తుంది. ఆధిపత్యానికి వ్యతిరేకంగా ప్రజాస్వామిక హక్కుల కోసం దేశంలో విద్యార్థి, రైతు, మహిళా, ఆదివాసీ ఉద్యమాలు ఎక్కడ ప్రవహించినా అక్కడ అతడి పేరే ధ్వనిస్తుంది. సంస్కారానికి మానవ రూపమిస్తే అచ్చం అతడిలా ఉంటుందంటారు. సాంస్కృతిక భిన్నత్వానికి అతడి జీవితమే ఒక తిరుగులేని ప్రతీకంటారు. 'జన సాంస్కృతిక మంచ్' వ్యవస్థాపకుడు. "జన సంస్కృతి" పత్రిక సంపాదకుల్లో ఒకడు. లోకపు కపటత్వానికి గుండె చెదిరి, స్వార్ధ ప్రయోజనాల నడుమ ఇమడలేక ఆత్మహత్య పేరిట దుర్మార్గమయిన సమాజం చేత హత్య కావించబడ్డ సున్నిత మనస్కుడు, హృదయమున్న మనిషి !

హృదయవైశాల్యం ఎలా ఉంటుందో తెలుసా? తన భాగం భూమినీ, ఆస్తినీ మొత్తం దళితుల కోసం పంచేసాడు. కుటుంబంలో ఇంకా ఉన్న పొలాన్ని కూడా పంచేయాలంటూ ఎప్పుడూ ఇంట్లో గొడవపడేవాడు. పెళ్ళైంది, భార్య పేరు నగీనా దేవి. ఆమెది పక్క గ్రామమే. ఆమె కూడా ఎప్పుడో చనిపోయిందట. పిల్లల్లేరు. ఊర్లోకొస్తే ఎప్పుడూ వాడలోనే ఉండే వాడట. అక్కడే తిండీ, నిద్ర, సర్వం. బహుశా, అందుకే ఆ గ్రామంలో ఎవరిని అడిగినా ఆయన ఇల్లెక్కడో చెప్పడమే







కాదు, ఆయన జ్ఞాపకాల్ని కూడా ఆత్మీయంగా ఆనాటి పెద్దలు స్మరించుకున్నారు. గోరఖ్ పుట్టిన గ్రామంలో మట్టిని కూడా ఆయన అభిమానులు వచ్చి ప్రేమగా తీసుకువెళ్ళిన సంఘటనలు ఉన్నాయంటే, అది అందరికీ సాధ్యమయ్యేది కాదు. అసంఖ్యాక ప్రజల గుండెల్లో అన్నేళ్ళపాటు కొలువుండటం కంటే, ఒక కవికి, కార్యకర్తకీ కావాల్సింది ఏముంది. నాకు తెలిసీ అంతటి సార్ధకతకి అర్హుడయిన అతి కొద్దిమంది మహావ్యక్తుల్లో నిస్సందేహంగా గోరఖ్ పాండే ఒకడు !

అలాంటి మహోన్నత వ్యక్తి అడుగుజాడల్లో చేసే ఔద్వేగికాన్వేషణలో భాగంగా, భారత స్వాతంత్ర్యోద్యమంలో రోమాంచిత ఘట్టమైన చౌరీచౌరా స్మృతుల్ని వంద సంవత్సరాలు పూర్తవుతున్న ఈ మహత్తర సమయంలో జ్ఞాపకం చేస్కోవడం సముచి తమనే నా భావం. జలియ న్వాలాబాగ్ హత్యాకాండకి నిరసనగా, బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా ఎగసిపడిన నిలువెత్తు క్రోధానికి తిరుగులేని నిదర్శనం చౌరీచౌరా. అలాంటి స్మృతి భవనంలో అందరు జాతీయ నాయకుల విగ్రహాలూ పెట్టి అంబేద్కర్‌ది పెట్టకపోవడం దారుణం. అదే విషయం అక్కడి నిర్వాహకులకి చెప్పడంతో పాటు, రాసొచ్చాను. ఈసరికే మతతత్వ శక్తుల చేతుల్లో నిర్వీర్యం ఐపోతున్న అటువంటి స్మృతిచిహ్నాలపై పెద్దగా నమ్మకమైతే లేదుకానీ, ఆ స్ఫూర్తిని రాబోయే తరాల్లో నుండి ఏ గుప్పెడు మందైనా కొద్దిగా గ్రహించకపోతారా అనే చిన్న ఆశ ఏదోమూల. నిష్ప్రయోజనమని తెలిసినా, నిరుత్సాహం దరిచేరనివ్వకుండా

తన పని తాను చేస్కుని అతి చిన్న వయసులో అమరుడయిన గోరఖ్ ని తల్చుకుంటూ ముందుకు సాగిపోయాను !

గోరఖ్ సోదరుడు బలరాంపాండే, మేనల్లుడు విష్ణుపాండేల్ని కలిసాం. ఏదో కొంత సమాచారం, కొన్ని సంగతులు పంచుకున్నారు. కొంత మెటీరియల్ చూపించారు. ఈసరికే నెట్లో చాలా వరకు ఉన్నాయవి. పేరుప్రఖ్యాతలకి దూరంగా కీర్తిప్రతిష్టలతో సంబంధం లేకుండా, తన సొంత భాష పై ప్రేమతో జనపదానికి జీవం పోస్తూ, పల్లె పదాల నుడికారంతో మనుషుల మధ్య ప్రేమ, మమకారాలకి ప్రాణం పోస్తూ, అతి సాధారణ ప్రజల భాషలో గోరఖ్ సృజించిన కవిత్వం, నిజానికది ఈ దేశపు భూమితో సంభాషిస్తూ, మట్టిని ముద్దాడుతూ, అణగారిన వర్గాలని కౌగిలించుకొని, సకల మానవ సంఘర్షణల సారాన్నీ అన్వేషించడం కోసం సాగిన అతడి జ్ఞాన వాహినికి ఒకానొక ప్రతిరూపం. అనితర సాధ్యమైన దార్శనికతతో ప్రజలతో ప్రత్యక్ష కార్యాచరణలో కలబోసుకున్న గోరఖ్ చేతనత్వం. ప్రజాపోరాటాల్లో భావాలు ఎంత బలమైన ఆయుధాలో గిడసబారిన చరిత్రకి మరొక్కసారి తేటతెల్లం చేసిన తాత్వికత్వం, వెరసి మొత్తంగా, గోరఖ్ కవిత్వం !

అమరులు భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల సంస్మరణ సమయంలో మహాకవి గోరఖ్ పాండే స్మృతికి నివాళులు అర్పించడం నా వరకూ నాకు ఒక సంతృప్తిని ఇచ్చింది. ఉన్న ఒక్కరోజులో గోరఖ్‌తో పాటూ, వంద సంవత్సరాలు పూర్తి చేసుకొన్న రోమాంచిత స్వాతంత్ర్యోద్యమం నాటి  చౌరీచౌరా స్మృతుల్నీ, మత సామరస్య మానవతావాద ప్రవక్త సంత్ కబీర్ అంతిమ స్మృతుల్నీ దర్శింపజేసి, అంతకుమించి 300 మైళ్ళకి పైచిలుకు కష్టతరమైన ప్రయాణాన్ని తన బైక్‌తో గ్రామసీమలదారుల్ని పలకరిస్తూ, ఆప్యాయత నిండిన భిన్న రుచుల్ని ఆస్వాదింపజేస్తూ, ఒక్కరోజులో చేసేలా, గొప్ప అనుభూతిని అందించడమే కాకుండా,బౌద్ధ, బహుజ నోద్యమశీలి,  అధ్యయన కారుడూ ఆశిష్ , ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర ఉద్యమ

నాయకుడు అరవిందిజ్ మొదలైన ప్రజా ఉద్యమ మిత్రులతో సమావేశం ఏర్పాటు చేసిన దళిత బహుజన ప్రజాతంత్ర ఉద్యమ మిత్రుడూ, సహచర కామ్రేడ్, ప్రస్తుతం అక్రమ కేసుల్ని ఎదుర్కొం టున్న సోదరుడు గౌతమ్‌కి, హృదయం నిండా ప్రేమతో నా చాన్నాళ్ళ కలని నిజం చేసిన కాలానికి, కలానికి, కవిత్వానికి, కథనానికి, కదనరంగానికీ సంధానంగా నిలిచిన విశిష్టమైన ప్రజాకవి గోరఖ్ పాండే కి వినమ్రతతో కూడిన విప్లవాభినందనలతో ఈ చిరు నివాళి !

(ఏ మాత్రం హిందీతో పరిచయం ఉన్నా నెట్లో ఆయన కవిత్వం ఉంది చూడండి. ఏ కొంచెం జీవనార్ద్రత తొణికినా ఆయన పదబంధాల్లో పయనం చేసి రండి. అది కవిత్వం కాదు, యుద్ధం. సాక్షాత్తూ యుద్ధమే. ఎడతెగని ధిక్కార చైతన్య స్వరమే.గోరఖ్ పాండే 'సమజ్దారోం కా గీత్' నాకు నచ్చిన కవిత్వం. అదికాక రెండు మూడు సంపుటాలు ప్రచురించ బడ్డాయ్. 'అబ్ లోహా గరమ్ హెూ గయా' మొదలుకొని ఆయన కవిత్వం తెలుగు చేయించడానికి నేను చేయని ప్రయత్నం లేదు. ఎంతమందికో జిరాక్స్ ప్రతులు తీసి పంపాను. మలయశ్రీ ఒకట్రెండు కవితలు తెలుగు కూడా చేసారు. ఎప్పటికైనా గోరఖ్ కవిత్వాన్ని సారంతో సహా తెలుగు చేయించి ప్రచురించాలనేది అభిలాష. గోరఖ్ పాండే, అవతార్ సింగ్ పాశ్, రమాశంకర్ యాదవ్ ఏ విద్రోహి వంటి కలం యోధుల కలాల్ని కనీసంగా అయినా కలలు కనే తరాలకు పరిచయం చేయగలనా అనే చిరకాల స్పృహని చిరస్థాయిగ నిలుపుకోడం కోసం చేసే ప్రయత్నంలో భాగమే ఎందరో శ్రేయోభిలాషుల సహకారంతో చేసిన ఈ చిరు ప్రయాణం గురించిన కొన్ని ఫొటోలతో ఈ రైటప్.)

(మార్చి 25, అమరుడు, పాత్రికేయ మహాయోధుడు, చింతనాశీలి గణేష్ శంకర్ విద్యార్థి వర్ధంతి స్మృతిలో...)

# విస్మరించబడిన అసాధారణ ప్రజ్ఞాశీలి
# భారతదేశ మొట్టమొదటి ఆంగ్ల రచైత్రి
# తోరూ దత్ !



భారతదేశంలో మొట్టమొదటి ఆంగ్ల రచయిత్రి. ఇండియా చరిత్రలో ఫ్రెంచ్ నవల రాసిన ఏకైక వ్యక్తి. ఇంగ్లీష్, ఫ్రెంచ్, జర్మన్, సంస్కృతం వంటి భాషల్లో ప్రావీణ్యత కలిగిన ఆధునిక సాహిత్య కారిణి. విద్యార్థిదశలోనే షేక్స్పియర్ మొదలు విక్టర్‌హ్యూగో వరకూ మహామహుల ఉద్గ్రంథాల్ని పుక్కిట పట్టిన అధ్యయనశీలి. మిల్టన్ ప్యార డైజ్ లాస్ట్ ని మక్కీకి మక్కీ ఒప్పచెప్పగల అసామాన్య రాలు, ఆమె–తోరూ దత్ !

బెంగాల్లో పుట్టిన తోరూ పారిస్‌లో చదివింది. తర్వాత ఫ్రాన్స్ నుంచి లండన్, కేంబ్రిడ్జ్ లో ప్రత్యేక మహిళా తరగతులకు హాజరైంది. అక్కడే మేరీ మార్టిన్ ను కల్సిన తోరూ ఫ్రెంచ్, భారతీయ సంస్కృతులకు సంబంధించి చేసిన లోతైన కృషి అసాధారణ మైంది. తర్వాత కోల్కతా వచ్చేసినామె భిన్న భాషా సాంస్కృతిక స్రవంతుల్లో ప్రయాణించిన తోరూ చిన్న వయసులోనే పరిపక్వత గల విస్తృతిని పొందగలిగింది!

అనేక రచనలు, అనువాదాలు చేసింది. అనేక భాషలతో పాటూ సంస్కృతాన్నీ నేర్చుకుంది. సాహిత్యంతో పాటు సంగీతం, కళలపట్ల కూడా మక్కువ చూపింది. ఆనాడే కాదు ఈనాటికీ అంతటి సాంద్రతగల భాషలో కవిత్వాన్ని రాసినవారు లేరంటారు. అదే తోరూ ప్రత్యేకత. చిన్న వయసులోనే సోదరినీ,సోదరుడ్నీకోల్పోయిన తోరూ అదే టి.బి. వ్యాధితో కేవలం 21 ఏళ్ళ అతి చిన్నవయసులోనే మరణించింది!

ఇండో ఫ్రెంచ్, ఇండోఆంగ్లియన్ ప్రప్రథమ రచయిత్రి. దాదాపు 65 మంది ఫ్రెంచ్ కవుల రచనల్ని ఇంగ్లీష్‌లోకి సారంతోసహా తర్జుమా చేసిన ఏకైక

అనువాదకురాలు. భారతదేశంలో ఆంగ్లంలో నవల రాసిన మొదటి వ్యక్తి. అంతే కాదు,ఫ్రెంచ్ నవల రాసిన ఒకే ఒక్క భారతీయ మహిళ, సంస్కృత పురాణ గ్రంథాల్ని ఆంగ్లంలో తర్జుమా చేసిన మొదటి భారతీయ మహిళ తోరూ దత్ దారుణంగా విస్మరించబడింది !




డా.గీతా షేట్ 27 ఏళ్ళు నిరవధిక పి హెచ్. డి పరిశోధన ఆధారంగా దీప్సజ్వాని,రవి రాజ్‌పుత్‌లు పద్నాలుగేళ్ళ క్రితం 2009 లో నిర్మించిన 15 నిమిషాలు నిడివిగల డాక్యు మెంటరీ చిత్రం Reviving Toru Dutt. కాలగర్భంలో కలిసి పోయిన ఒక విశిష్టమైన భారతీయ మహిళ లేఖలు, రచనల ఆధారంగా ఆమె హృదయాన్ని స్పృశించే ప్రయత్నం చేసింది.

నిజానికి తోరూదత్ కంటే ముందే కృపాబాయ్ సత్తినాథన్ వంటి మహిళలు చేసిన కృషిని గురించి, అలాగే సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో పద్మినిసేన్ గుప్త రాసిన తోరూదత్ గూర్చిన రచనను నాయని కృష్ణకుమారి తెలుగు లోకి అనువదించడం మొదలు ఈమధ్య కాలంలో కొద్దిమంది వర్ధమాన యువరచయితలు సైతం తోరూదత్ కవితలు అనువదించడం వరకూ ఈ రైటప్ పరిధిలో చేర్చలేదని మనవి.

(భారతీయ సాంస్కృతిక వికాసోద్యమ కృషితో నన్నెంతగానో ప్రభావితం చేసిన ఇరువురు బెంగాల్ యోధుల్లో ఒకరు హెన్రీ డిరాజియో ఐతే, రెండు తోరూ దత్. ఎప్పుడు కోల్‌కతా వెళ్ళినా సంస్మరణ స్థలాలకి వెళ్ళాలనుకొని అలాగే సమయం చాలక మళ్ళీ వెనక్కు రావడం అలవాటైంది. జీవితాన్ని ఒక ఉన్నతమైన లక్ష్యం కోసం ధారపోసిన తోరూ కృషికి నివాళిగా వర్ధంతి రోజు ఈ చిన్న రైటప్ !)

# మహోన్నత నవబౌద్ధుడు భదంత డాక్టర్ ఆనంద కౌసల్యాయన్ !!!



"నేను మరణించాక నా సమాధి పై బాబా సాహెబ్ అంబేద్కర్ కలలకి అను గుణంగా ఈ భారతదేశాన్ని నిర్మించే సమరంలో అమరుడైన ఒక సైనికుడి స్మృతి చిహ్నమిదని వ్రాయండి !"

భదంత డాక్టర్ ఆనంద కౌసల్యాయన్. భారతీయ బౌద్ధ సారస్వత కేతనాన్ని సమున్నతంగా నిలిపిన అరుదైన మేధావి. బౌద్ధ ధర్మానికి కట్టుబడి జీవిస్తూ కూడా ప్రజాక్షేత్రంలో సామాజిక కార్యకర్తగా మనగలిగిన విలక్షణ దార్శనికుడు. 20వ శతాబ్దపు అత్యుత్తమ బౌద్ధ ఆలోచనాపరుల్లో ఒకడు. మహా పండిత్ రాహుల్ సాంకృత్యాయన్, డా. బాబాసాహెబ్ అంబేద్కర్ ఇరువురి ఆదర్శాల మేలుకలయిక. భారతీయ సంస్కృతిలోని చింతనాత్మక బౌద్ధ వారసత్వానికి తిరుగులేని ఉదాహరణ. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న దేశభక్తుడు. ప్రపంచంలోని అనేకానేక దేశాలు, ప్రదేశాలు తిరిగి ఆయా వివరాలు నమోదు చేసిన విస్తృత యాత్రికుడు. మూల బౌద్ధాన్ని పాళీ భాషలో అధ్యయనం చేసి సారాన్ని సామాన్యుల దరికి చేర్చడానికి విశేష కృషి చేసిన బుద్ధిజీవి. ఎన్నో ప్రజాభ్యుదయ గ్రంథాల రచయిత, స్వతంత్ర చరిత్రకారుడు,అనువాదకుడు. సంస్కరణ వాది,గాంధేయవాది, అధునాతన నవబౌద్ధుడు. ఇంకా ఎన్నో విశేషాల సమ్మేళనం ఆనంద్ కౌసల్యాయన్ అపూర్వ వ్యక్తిత్వం !

బౌద్ధంలోని మానవత్వం, గాంధీజీ సత్యాగ్రహం, అంబేద్కర్ సోషలిజం, రాహుల్జీ కమ్యూనిజం వంటి విశిష్టమైన గుణాలను స్వీకరించి తన మార్గాన్ని

సర్వోన్నతంగా తీర్చిదిద్దు కున్నాడు. బౌద్ధ సాంప్రదాయాల్ని నేర్చుకోవడం కోసం, పరిశీలించడం కోసం శ్రీలంక, నేపాల్, బర్మా, జపాన్, జర్మనీ, ఫ్రాన్స్, లండన్ వంటి దేశా లెన్నింటినో పర్యటించాడు. ప్రపంచంలోని ప్రముఖ బౌద్ధ గురువులందర్నీ కలిసి చర్చించాడు. వివిధ రకాల సిద్ధాంతాల ఆదుపాదుల్ని పట్టి చూసాడు. ఆనంద కౌసల్యాయన్ అనితర సాధ్యమైన అధ్యయనం గురించి ఇప్పటికీ ఆయన అభిమానులు కథలుగా చెప్పుకుంటారంటే అతిశయోక్తి కాదు. అంత లోతుగా, విస్తృతంగా బౌద్ధ వాంగ్మయాన్నీ, భారతీయ సాహిత్య ధోరణులను చదివిన బౌద్ధ పండితులు అరుదు. ఆయన రచనలు చూస్తే ఈ విషయం తెలుస్తుంది. అణగారిన వర్గాల ప్రజలకి వెన్నుదన్నుగా, బహుజన హితం కోసం కట్టుబడి వ్యక్తిగత జీవితాన్ని సైతం త్యాగం చేసిన నిజమైన పరివ్రాజకుడు కౌసల్యాయన్ !

పంజాబ్‌లో అంబాలా దగ్గర సోహనా గ్రామంలో 1905 లో హరనామ్‌దాస్‌గా జన్మించిన ఆయన లాహోర్ నేషనల్ కాలేజీలో బి. ఎ. చదివాడు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నాడు. రాహుల్ సాంకృత్యాయన్ స్ఫూర్తితో అధ్యయనం, దేశాటనాల్ని సాధనంగా చేసుకుని మొదట విశ్వనాథగా తర్వాత ఆనంద కౌసల్యాయన్ గా మారాడు. బౌద్ధ సాహిత్యాన్ని మథించాడు. కులతత్వాన్ని, మతోన్మాదాన్నీ, మూఢ నమ్మకాల్ని, ఛాందస భావాల్ని నిరసిస్తూ విప్లవాత్మక రచనలు చేశాడు. సామాజిక, రాజకీయ, సాంస్కృతిక అంశాలపై తన అనుభవాలతో వ్యాసాలెన్నో రాసాడు. 'జో లిఖనా పడా' అనే గ్రంథాన్ని మహాత్మా గాంధీకి, 'బోధి జీవన పద్ధతి' అనే పుస్తకాన్ని బాబా సాహెబ్ అంబేద్కర్‌కీ అంకితం ఇచ్చాడు. అంబేద్కర్ కోసం "యదీ బాబా నా హోతే" అనే అద్వితీయ రచన చేసాడు. ధమ్మ పథాన్ని హిందీ చేసాడు. ప్రముఖ అజ్ఞాతవాది, పాశ్చాత్య నాస్తిక తత్వవేత్త ఇంగర్సోల్ కృషికి వ్యాఖ్యాతగా స్వతంత్ర చింతన్, ధర్మ్ కే నామ్ పర్ మొదలైన పుస్తకాలు రాసాడు. పాల్ కారస్ రాసిన 'ది గాస్పెల్ ఆఫ్ బుద్ధా' ను హిందీలోకి అనువదించాడు. భగవద్గీత గురించి సాధికారిక విమర్శ రాసాడు. అనేక వ్యాసాలు, నవలలు, కాల్పనిక సాహిత్యం కూడా రచించాడు !

భారతదేశంలో బౌద్ధ సాంస్కృతిక వికాసానికి కృషి చేసిన ఐదుగురు మహా బిక్షువులుగా ధర్మానంద కొశాంబి, రాహుల్ సాంకృ త్యాయన్, భంతే జగదీష్ కశ్యప్, బాబాసాహెబ్ అంబేద్కర్ లతో పాటు భదంత డాక్టర్ ఆనంద కౌసల్యాయన్‌ని కూడా పేర్కొంటారు. అయితే, భదంత ఆనంద కౌసల్యాయన్‌ని బౌద్ధ జగత్తులో నిలిపిన రెండు గొప్ప పనులు, ఒకటి బాబాసా హెబ్ అంబేద్కర్ విశిష్ట రచనయిన, 'బుద్ధుడు : అతని ధర్మం' గ్రంథాన్ని హీందీలోకి, పంజాబీ లోకి, 'రిడిల్స్ ఆఫ్ హిందూయిజం' గ్రంధాన్ని హిందీలోకి సమర్ధవంతంగా అనువదించడం. అంబేద్కర్ మహోన్నత ఆలోచనల్ని లక్షలాది మంది ప్రజలకి చేర్చడానికి ఈ మహత్కార్యం దోహదపడింది. ఇక రెండోది, ముఖ్యమైనది, దక్షిణాది భావోద్యమకారులు గుర్తించాల్సినది, ప్రఖ్యాత భావోద్యమకారుడూ, అంబేద్కర్ని ఆకర్షించిన తెలుగువాడూ, సంస్కరణ వాది ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు అద్భుత రచన 'ది ఎస్సెన్స్ ఆఫ్ బుద్దిజం' ని 'బౌద్ధ్ ధర్మ్ కా సార్' పేరిట హిందీలోనికి అనువాదం చేసి ప్రచురించడం. ప్రపంచ బౌద్ధ సాహిత్యంలోనే విశేష స్థానాన్ని పొందిన ఈ గ్రంథాన్ని హిందీ చేయడం ద్వారా, బౌద్ధాన్ని కేవలం ఆధ్యాత్మిక మతంగా కాక, మార్పుకి సారధ్యం వహించే మాధ్యమంగా, మానవ జీవన విధానాన్ని విలువలతో కూడిన ఆచరణాత్మక వైఖరితో ప్రభావితం చేసే నైతిక మానవీయ మహామార్గంగా ప్రతిష్ఠించగలగడం ఆనంద కౌసల్యాయన్ సాధించిన విశిష్ట విజయం !

అంబేద్కర్ హఠాన్మరణం తర్వాత ముంబాయిలోని దాదార్లో ఆయన అంత్య క్రియలు ఆనంద కౌసల్యాయన్ ఆద్వర్యంలోనే జరిగాయి. ఆ సమయంలో దీక్ష కోసం సిద్ధపడిన లక్షలాది మందిని సమన్వయపర్చిన ఘనత నిస్సందేహంగా ఆనంద కౌసల్యాయన్ దే. అంతే కాక, బాబాసాహెబ్ మరణంతో బౌద్ధ ధర్మ ప్రచారోద్యమం పై ప్రతికూల ప్రభావం పడ కుండా, నాగపూర్లోని దీక్షాభూమిని తన నివాసంగా చేసుకుని అంబేద్కర్ ఆశయాల్ని ఆచరణాత్మకంగా కొనసాగించడం కోసం, జీవితాంతం అక్కడే ఉండి బౌద్ధ ధర్మ ప్రచారం చేసిన మహోన్నత బౌద్ధుడు ఆనంద కౌసల్యాయన్. అందుకే, ఆయన చేసిన కృషికి నివాళిగా మరణానంతరం దీక్షాభూమి లో ఆనంద కౌసల్యాయన్ విగ్రహం ఈనాటికీ ఉంది. ఇదంతా ఒకెత్తయితే, రాహుల్జీ

స్ఫూర్తితో బౌద్ధ పరివ్రాజకుడిగా ఆయన చేసిన ప్రయాణాలు ఒకెత్తు. దాదాపు ప్రపంచంలోని ప్రఖ్యాత బౌద్ధ దేశాలన్నీ వెళ్ళిన ఆయన ప్రతీ దేశం గురించి కూలంకషంగా అధ్యయనం చేసి విశ్లేషిస్తూ ప్రత్యేకమైన రచనా వ్యాసంగం సృష్టించారు. రాహుల్జీ తరువాత అంతటి యాత్రా సాహిత్యాన్ని రాసిన వ్యక్తి ఆనంద కౌసల్యాయన్ ఒక్కరే. 'రాహుల్జీ బాల్ సదన్' పేరిట పిల్లల కోసం విద్యా కేంద్రాన్ని కూడా స్థాపించి కొనసాగించారు. ప్రయాగలోని హిందీ సాహిత్య సమ్మేళన్, వార్ధాలోని రాష్ట్రభాషా ప్రచార సమితి వంటి సంఘాల్లో చురుకుగా పాల్గొన్న కౌసల్యాయన్, సులభమైన భాషను ప్రయోగించి సగటు మనిషి హృదయంలో బౌద్ధ ధర్మాన్ని ప్రతిష్టించడమే లక్ష్యంగా చేసుకుని జీవితాంతం నిబద్దతగా పనిచేసారు !

బాబాసాహెబ్ అంబేద్కర్ స్వప్నాల్ని నిజం చేయడానికి యుద్ధం చేసి అమరుడైన వాడ్నని ప్రకటించుకోగల ఏకైక బౌద్ధ యోధుడు కౌసల్యాయన్. కనుకనే, 'మనుధర్మ శాస్త్రాన్ని ఎందుకు దహనం చేయాల్సి వచ్చింది?" ,స్వతంత్ర చింతన, వంటి గ్రంథాల్ని రచించి అంబేద్కర్ కి మద్దతుగా ప్రచారం చేశారు. 'సులభ శైలిలో పాళీ భాష పరిచయం' వంటి అమూల్య మైన గ్రంథాలను కూడా రాసారు. తెలుగులో కూడా ఒకట్రెండు ఆయన రచనల తర్జుమా జరిగింది. హేతువాద మానవవాద దృష్టితో,తర్కబద్ధ ప్రమాణాలతో క్లిష్టతరమైన ఎన్నో తాత్విక భావనల్ని అత్యంత సులువుగా రాయడం కౌసల్యాయన్ ప్రత్యేకత. ఉత్తర భారతంలో ఈ మాత్రమైనా భావోద్యమాల ప్రభావం ఉందంటే అందుకు ఆనంద కౌసల్యాయన్ వంటివారే కారణం. భారతీయ తాత్విక ధోరణిలోని ఆరోగ్యకర అంశాల్ని కాపాడడం కోసం భదంత ఆనంద కౌసల్యాయన్ చేసిన కృషి భారతీయ బౌద్ధ సారస్వత చరిత్రలోనూ, ప్రగతిశీల ప్రజా పురోగామి క్షేత్రంలోనూ నమోదు చేయడం అవసరం. అందులో భాగంగా నవీన బౌద్ధ ప్రచారోద్యమాలు ఆయన కృషిని ఆ మేరకు గుర్తించి గౌరవించడం, అలానే నిర్మాణాత్మక ప్రజాతంత్ర భావజాలానికి తగినట్టుగా ఆయన వారసత్వాన్ని కొనసాగించడమే ఆ మహెూన్నత వ్యక్తికి మనమిచ్చే చిరు నివాళి కాగలదు !

(జూన్ 22 , భదంత డాక్టర్ ఆనంద కౌసల్యాయన్ 35 వ వర్ధంతి నివాళి.)

# విస్మృత హక్కుల యోధుడు : సి.వి.సుబ్బారావు!



''సుబ్బారావుతో ఒక మేరకైనా పరిచయం ఉన్నవాళ్ళకి అతన్ని మర్చిపోవడం ఎంత కష్టమో, అతన్ని బొత్తిగా తెలియని వాళ్ళకి కొత్తగా పరిచయం చేయడం బహుశా అంతే కష్టం.'' అనే వాక్యంతో సి.వి. సుబ్బారావు రచనల సంపుటి 'సందిగ్ధ సందర్భం ' మొదల వుతుంది. నిజమే, సి. వి. సుబ్బారావు. ఒక్క తెలుగు రాష్ట్రంలోనే కాదు, దేశంలోనే అరుదైన హక్కుల యోధుడు. 1953 నవంబరు 17 న రాజమండ్రిలో మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. పిన్న వయసులోనే సాహిత్యం స్ఫూర్తి, సామాజిక స్పృహ రెండూ చెరో కన్నుగా మల్చు కున్నాడు. 13 ఏళ్ళ వయసులో మహాకవి గురజాడ అప్పారావుకి అంకితమిస్తూ రాసిన కవితని శ్రీశ్రీ ముఖ్య అతిధిగా పాల్గొన్న సమావేశంలో చదివాడు. 14 ఏళ్ళ విద్యార్థిగా 'ఉదయరేఖ' అనే లిఖిత మాసపత్రిక స్థాపించి, నడిపిన వాడు. 1970 లో విశాఖలో జరిగిన శ్రీ శ్రీ షష్టిపూర్తి సభలో చరిత్ర సృష్టించి 'విరసం' ఆవిర్భావానికి కారణమైన విద్యార్థుల్లో అతిచిన్న వయస్కుడు సుబ్బారావే అంటారు. అలా 'విశాఖ విద్యార్థులు' మొదలు 'సాహితీ మిత్రులు', 'సృజన' వరకూ సుబ్బారావుది అవిరామ విప్లవ పరిణామం.

విశాఖలో బి.ఎస్సీ పూర్తి చేసాక ఆంధ్రా యూనివర్సిటీ లో ఎమ్మే ఎకనామిక్స్ చదువుతూ రాడికల్ రాజకీయాల్లో ప్రవేశించి అసాధారణ కృషి చేశాడు. శ్రీకాకుళం, నక్సల్బరీ పోరాటాల వెలుగులో తనదైన దృష్టికోణాన్ని నిర్మించు కున్నాడు. మార్క్సిస్టు లెనినిస్టు భావజాలాన్ని ప్రత్యేక మైన దృక్పథంతో ప్రతిష్టించు కున్నాడు. ఎమర్జెన్సీ కాలంలో వి. ఎమ్. తార్కుండే వంటి వారితో సమానంగా సి. వి. సుబ్బారావు చేసిన పోరాటాన్ని పోలుస్తూ రాసిన ప్రఖ్యాత చరిత్రకారుడు రామ చంద్ర గుహ,

సంకెళ్ళతో పరీక్ష హాలుకి తీసుకు రాబడిన సుబ్బారావు యూనివర్శిటీ ప్రథమ స్థానంలో ఉత్తీర్ణుడయ్యాడంటారు. భారతీయ ప్రజాస్వామిక హక్కుల పోరాట చరిత్ర రచనలో జవహర్‌లాల్ నెహ్రూతో పాటూ తప్పనిసరిగా పేర్కోవలసిన పేరు సి.వి. సుబ్బారావుది అంటారాయన. అంతేకాదు, How much should a person consume? అంటూ పర్యావరణ స్పృహతో రాసిన పుస్తకాన్ని సి.వి.సుబ్బారావుకి అంకితం ఇచ్చారంటే ఆయనకి సుబ్బారావు మీదున్న అభిమానం అర్థమవుతుంది.

పీపుల్స్ యూనియన్ ఫర్ డెమోక్రటిక్ రైట్స్ (PUDR) వ్యవస్థాపకుల్లో ఒకడిగా జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో సుబ్బారావు చేసిన కృషి విశిష్టమైనది. నిజానికి తెలుగులో ఒక నిర్దిష్టమైన హక్కుల ఉద్యమానికి సంబంధించిన విశాలమైన ఆలోచనా ప్రాంగణానికి అప్పుడే బీజాలు పడ్డాయని చెప్పొచ్చు. భోపాల్ విష వాయువు ప్రమాదం మొదలు, మీరట్, గుజరాత్ మత కలహాల వరకూ, బస్తర్ ఆదివాసీల స్థితిగతులు, బీహార్, ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, రాజస్థాన్‌లలో భూపోరాటాలు, ఆంధ్రప్రదేశ్, తెలంగాణలో పౌరహక్కుల కోసం ఎనలేని కృషి చేశాడు. ఆర్థిక శాస్త్రవేత్తగా మావోయిస్టు చైనా పారిశ్రామిక అభివృద్ధి పై అధ్యయనం చేసాడు. ఈశాన్య రాష్ట్రాల జాతుల సమస్యపై పరిశోధన చేసి 'రగులుకొనే రాక్షసిబొగ్గు' అనే పుస్తకం రాసాడు. తెలుగులో మొట్ట మొదటిసారిగా రాజకీయార్థిక శాస్త్రాన్ని సులభ శైలిలో పరిచయం చేస్తూ పుస్తకం రాసాడు.

ఇవికాక సాహిత్యంలో సుబ్బారావు చేసిన కృషి ప్రత్యేకమైనది. రాశిలో తక్కువే అయినా వాశిలో నిలవదగ్గ కవితలు రాసాడు. "తెలుగు కవిత్వంలో స్పష్టత – ఒక అవిశ్వాస ప్రకటన" అంటూ 'కేవలం పాఠకేశ్వరరావు' పేరిట అడపాదడపా చురకలు వేసాడు. ఇంకా కొన్నికథలు, ఒక నాటిక రాసాడు. శ్రీశ్రీ, కొ.కు, బంగోరే వంటివారి కోసం సంస్మరణ వ్యాసాలు, విలువైన సమీక్షలు, లేఖలు, ఇవికాక ఎన్నదగిన విశ్లేషణాత్మక వ్యాసాలు రచించాడు. 'ఏంటీ ఎలిజీ' కవితలో, "జీవించగల జీవితం తప్ప ఇంకేమీ లేని వాణ్ణి / అమరత్వాన్ని కవిత్వంలో ఆవిష్కరించ నిరాకరిస్తాను"

అని గర్జించాడు. తెలుగు సాహిత్యాన్ని నిష్కర్షగా విమర్శించాడు. పర్స్పెక్టివ్స్ ప్రచురించిన మతవర్గతత్వం అనే సంకలనం గురించి రాస్తూ, "ఇది స్వేచ్ఛానువాదం కాదు, అరాచకానువాదం" అనేసాడు. సాంస్కృతిక రంగంలో వస్తోన్న పెనుమార్పుల్ని సుబ్బారావంత లోతుగా పరిశీలించిన వారు లేరేమో. 'రంగుల వల' పేరుతో తెలుగు సినిమా రాజకీయార్థిక పరిచయం రాసిన మొట్ట మొదటి విశ్లేషకుడు సి.వి. సుబ్బారావే.

పాలస్తీనా సమస్య మీద, "భూమిలేని ప్రజల కోసం ప్రజలులేని భూమి" అంటూ వేణుగోపాల్‌తో కలిసి 40 ఏళ్ళ క్రితమే సృజనలో వ్యాసం రాసాడు. భూములు, గనులు, భూరి సంపదలు ఎవ్వరివి? అంటూ ప్రశ్నించాడు. చత్తీస్‌గఢ్ శంకర్ గుహనియోగి పోరాటం మొదలు ఝార్ఖండ్ లోని ప్రజాపోరాటాల వరకూ క్షేత్రస్థాయిలో పర్యటించి ఈ దేశపు పీడిత ప్రజల గొంతుకలని అక్షరాల్లో సృజించడానికి ప్రయత్నం చేసిన అసాధారణ హక్కుల కార్యకర్త సుబ్బారావు. కుటుంబ వ్యవస్థలో స్త్రీల అణిచివేతపై సాధికారికంగా వివరిస్తూ వ్యాసం రాసిన సుబ్బారావు, విజయవాడలో జరిగిన ఆర్థిక శాస్త్రవేత్తల తొమ్మిదవ వార్షికోత్సవంలో 'సమిష్టి ఆస్తి – సామాజిక సంఘర్షణ' పేరిట అద్భుతమైన పేపర్ చదివాడు. 'వెలుగు చీకట్లు' పేరిట ఆంధ్రప్రదేశ్ రైతాంగ పోరాటాల చరిత్ర నమోదు చేసాడు. మరాఠీ సాహిత్య సమ్మేళనం మొదలు కారంచేడు దుర్మార్గం వరకూ సుబ్బా రావు నాడు స్పందించని అంశం లేదు.

ప్రజా వైద్యులు డాక్టర్ రామనాథంగారి హత్య తర్వాత ఆయన జీవితం గురించి సృజనలో 'వెలుగు నీడలు' అనే గొప్ప వ్యాసం రాసాడు. కన్యాశుల్కం శతజయంతి సందర్భంగా "వంద సంవత్సరాల ఒంటరి తనం" అనే వ్యాసం రాసాడు. ప్రత్యామ్నాయ సాంస్కృతిక భావజాలం గురించిన సంవాదాన్ని పరిపుష్టం కావిస్తూ, ప్రచార సాధనాల గురించి "బండెడు అబద్ధం – చిటికెడు సత్యం", వికాస విద్యావనం వార్షికోత్సవం సందర్భంగా రాసిన "టెలివిజనూపిల్లలూ", 'విరసంపై తెలుగు

సాహిత్యప్రభావం' వంటివి సుబ్బారావు రచనల్లో ఆణిముత్యాలు. వీటన్నింటిలోకీ విలక్షణమైన ప్రయోగం, 'విభాత సంధ్యలు' గా సి.వి. వెలువరించిన సంకలనం. తెలుగు సాహిత్యంలో విశిష్టమైన కృషి అది. కవి, రచయిత, విమర్శకుడు, ప్రచురణకర్త, సాహితీజీవి, హక్కుల ఉద్యమకారుడు, విశేష అధ్యయనశీలి, ఢిల్లీలో లెక్చరర్‌గా పనిచేస్తూ దేశ వ్యాప్తంగా అపూర్వమైన హక్కుల స్పృహ నిర్మించడానికి నిరంతరం కృషి చేసిన చెన్నా ప్రగడ వెంకట సుబ్బా రావు 1994, జనవరి 17 న ఢిల్లీలో అకస్మాత్తుగా మరణించాడు.

సి. వి. సుబ్బారావు అకాల మరణానికి ఆనాడు దేశ వ్యాప్తంగా అనేక ప్రజాతంత్ర హక్కుల సంఘాలు నివాళులు అర్పించాయి. తెలుగులో 'సుబ్బారావు మిత్రులు' మూడొందల పుటలతో ఆయన రచనల్ని సేకరించి గ్రంథంగా ప్రచురించారు. ఒక హక్కుల కార్యకర్తకి సంబంధించీ తెలుగులో వచ్చిన మొట్ట మొదటి రచనా సంపుటి అదే. అందులోని పరిచయ ప్రయత్నంగా రాసిన ముందు మాటలోని చివరి వాక్యాలు, బహుశా ఒక అవిరామ ఆలోచనా పరుడిగా, ప్రజాపక్ష బుద్ధిజీవిగా సుబ్బారావు కృషిని ప్రతీతరంలోనూ కాలాతీతంగా నిలిపే నివాళిమాటలు: "సుబ్బారావు ఇవాళ మన మధ్య లేడు. ఐనా, అతను ఒక జీవితకాలం సంఘర్షించిన సందర్భం ఉంది. అందుకే, అతనితో పరిచయం మన చైతన్యాన్ని, కర్తవ్యాన్ని ఏదో ఒక మేరకి స్పృశిస్తుంది. అతనికిష్టమైన మాటల్లో చెప్పుకోవాలంటే..." ప్రయాణారంభాన్ని మర్చిపోతే గమ్యం శిథిలమవుతుంది."

(నవంబర్ 17, అరుదైన హక్కుల యోధుడు, PUDR సంస్థ వ్యవస్థాపకుడు, సి.వి. సుబ్బారావు 70 వ జయంతి సందర్భంగా...)

----------------

